# రాజపోషకులు

శ్రీ రాజా రామదేవరావు బహద్దరువారు.

శ్రీ రాజా నాయని వేంకటరంగా రావు బహద్దరువారు.

శ్రీ గౌరవనీయ కొండా వేంకటరంగా రెడ్డిగారు.

ఆంధ్రచంద్రికా గ్రంథమాల. ౨

# ప్రాచీన జాతులు

—: గ్రంథకర్త :—

ఖండవల్లి బాలేందుశేఖరం ఎం. ఏ.

లెక్చరార్-ఉస్మానియాకళాశాల, వరంగల్



—: ప్రకాశకులు :—

ఆంధ్రచంద్రికా గ్రంథమాల

హైదరాబాదు- దక్కన్.

౧౩౫౧

# సంపాదకీయ భూమిక

"చరిత్ర అంటే మనుష్యుడు చేసిన కృషి, మనిషి అనుభవజ్ఞానం... ఈ విశ్వప్రపంచంలో చరిత్రలేని వస్తువేమున్నది? చరిత్ర రాయికున్నది; రప్పకున్నది. ... మనుష్యునికుండడంలో ఆశ్చర్యమేమిటి? మనిషి తన నిమిత్తం తాను చేసుకునే యీ కృషిఫలితమే చరిత్ర. మనిషి చరిత్ర ఎంత విచిత్రమయినది? ... వర్తమానానికి భూతభవిష్యత్తులు రెండు కొనలు. కాలచక్రం తిరిగిన కొద్ది వర్తమానం భూతమూ, భవిష్యత్తు వర్తమానమూ అవుతూవుంటుంది. నిన్నను బట్టి నేడూ, నేటినిబట్టి రేపూ శోభిస్తూ వుంటవి... ప్రతిసభ్య దేశానికి బలాన్ని ఇస్తున్నదీ, జవము నిస్తున్నదీ చరిత్రే. చరిత్రంటే ప్రభుశక్తి, చరిత్రంటే మంత్రశక్తి, చరిత్రంటే ఉత్సాహశక్తి...... చరిత్ర మనిషిలో ఆత్మవిశ్వాసాన్ని వృద్ధి నొందిస్తుంది... చరిత్ర మనిషికి ఆశపోస్తుంది......"

అని సుప్రసిద్ధచరిత్రకారులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చరిత్ర ప్రభావమును గూర్చి సూత్రీకరించియున్నారు. ప్రతి మనుష్యుడు తన జన్మదేశ చరిత్రనేగాకుండ, ఇతర దేశముల చరిత్రలను గూడ తెలిసికొని యుండవలెను. ఇతర దేశీయుల చరిత్రలను మనము తెలిసికొనకుండ నుండుట చేతనే మనము స్వాతంత్ర్యమును గోల్పోయి పరాధీనత పాలు కావలసివచ్చియుండెను. ఇతర దేశీయుల చరిత్రలను వ్రాసి, పఠించి, జీర్ణము చేసికొన్నవారే ఇప్పుడు ప్రపంచము నేల కలుగుచున్నారు.

ఇట్టి ప్రభావముగల చరిత్రాధ్యయనమును ఆంధ్ర సోదరులకు కలిగించుటకై మా ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో ఏడవ కుసుమముగా "ప్రాచీనజాతులు" అను పేరుతో ఈ చరిత్రగ్రంథమును ప్రకటించుచున్నాము. ఇందు ఫినీషియా, కార్థేజి, హిట్టయిటు, ఫ్రిజియా, లిడియా అను ప్రాచీన జాతుల చరిత్రలు చక్కగా వర్ణింపబడినవి. గ్రంథకర్తయగు శ్రీ. బాలేందుశేఖరంగారు గొప్ప చరిత్ర విదులు. మా గ్రంథమాలలోని మొదటి కుసుమమగు "విస్మృత సామ్రాజ్యములు" అను గ్రంథరాజమును వ్రాసినది యీ బాలేందుశేఖరంగారే. ఈగ్రంథమునందు వర్ణితమయిన ప్రాచీనజాతుల వారు సుమారు మూడు వేల సంవత్సరముల క్రిందట ప్రసిద్ధికెక్కినవారు. వీర విహారమునకును, విద్యా వాణిజ్యములకును పేరుపొంది కాలప్రభావమున నామమాత్రావశిష్టములయిన జాతులవారు. ఫినీషియనుల నౌకావిజ్ఞానము, కార్థేజియనుల స్వాతంత్ర్యనిరతి, ఫిజియనుల, హిట్టయిటుల, లిడియనుల విశిష్టత ఈ గ్రంథమునందు విశదీకరింపబడినది. సమ్మోచితమైన విషయవర్ణనము, సరళమైన భాషారచనముగల యీ చారిత్రక గ్రంథము అందరి హస్తముల నలంకరించుగాక!

15-5-1952. సంపాదకుడు.

# వి ష య సూ చి క.

౧

మొదటి భాగము

# ఫినీషియా జాతివారి విశిష్టత

పురాతనకాలమునందు తమ నాగరికతా వైభవము చేతను, బుద్ధికౌశలము చేతను, శక్తిసామర్థ్యములచేతను, మహత్తర కార్యనిర్వహణముచేతను విఖ్యాతిగాంచిన జాతులలో ఫినీషియావారొక్కరు. పిట్ట కొంచెమైనను కూత ఘనమన్న సామెత ప్రకారము వీరి దేశము చిన్నదియు, వీరి జనసంఖ్య స్వల్పమయ్యును, ఫినీషియావారు, ఇతర దేశము లతో తులదూగజాలు గౌరవ ప్రతిష్ఠలు సంపాదించిరి. ఫినీషియా జాతివారు గొప్ప నావికులుగను, వ్యాపారస్థులుగను ప్రశస్తిగాంచిరి. వీరు తమ నావలలో మిక్కిలి దూరదేశము లకు పోవుచుండెడివారు. తూర్పున భారతదేశమునకును, పశ్చిమమున బ్రిటీషుదీవుల వరకును కూడ ఫినీషియావారి నావలు ప్రయాణము చేయుచుండెడివి. వీరొకపర్యాయము ఆఫ్రికా ఖండముయొక్క తూర్పుతీరము ననుసరించి క్రమముగా గుడ్ హోపు అగ్రమునుచేరి, అచ్చటినుండి మరల ఉత్తరదిక్కునకు, ఆఫ్రికాఖండపు పశ్చిమతీరము ననుసరించి ప్రయాణముచేసి తుట్టతుదకు మధ్యధరాసముద్రముద్వారా తమ దేశమునకు చేరి నట్లు చరిత్రల వలన తెలియవచ్చుచున్నది. క్రీ. శ. పదునేనవ శతాబ్దియందు విఖ్యాత నావికుడును, స్పెయిను దేశస్థుడనగు, వాస్కోడిగామా యనునాతడు దీర్ఘఘమగ ఆఫ్రికాఖండమును

చుట్టు తిరిగి హిందూ దేశమునకు సముద్రముపై త్రోవ కన్గొనెను. వాస్కోడిగామాకు సుమారు 2 వేల సంవత్సరములకు పూర్వమే, తమ సామాన్య నౌకలపై, భయంకరమగు మహాసముద్రములపై ప్రయాణములు గావించిన ఫినీషియావారి ధైర్యసాహసము లెంత ప్రశంసాపాత్రములో వేరుగా తెలుపనక్కరలేదు. నౌకా నిర్వహణమునందింత సమర్థులైన కారణమున ఫినీషియా దేశస్థులు వివిధ దేశముల ప్రజలతో వ్యాపారము సల్పుచు తమ దేశమునందలి వస్తువుల నచ్చటివారికంద జేయుచు,వారియొద్ద లభ్యములగు నపూర్వ వస్తువులను తాము గైకొనుచు గొప్ప వర్తకులుగ పేరు మోసిరి. ఈనాడు ప్రపంచమునందు బ్రిటిషువారికిగల కీర్తియే పూర్వకాలమున ఫినీషియా దేశస్థులు వహించి రని తెల్పుట సత్యదూరము కానేరదు. శిల్పకళ యందును, లోహముల పైనను, శిలల పైనను,కట్టె పైనను, చెక్కడము పనియందును వీరు మిక్కిలి నేర్పరులుగ నుండెడివారు. జెరూసలేమ్ పట్టణమున విఖ్యాత యూదు చక్రవర్తి యగు సాలమన్ అను నాతనిచే నిర్మింపబడిన మహత్తరమగు దేవాలయమును ఫినీషియా శిల్పులే నిర్మాణము కావించిరి. సర్వసాధారణముగ వ్యాపారస్థులందరివలెనే వీరుకూడ శాంతిప్రియులు. కాని సమయముపర్పడినప్పు డెంతటి బలవత్తరశాత్రవులనైనను ధిక్కరించి, పోరాడుటకు వీరు వెనుదీయలేదు. మహావీరుడగు అలెగ్జాండ రంతటి వానిని వీరు ముప్పుతిప్పలుపెట్టి,తుదకు ఆతని యపార బలమునకు లొంగిపోయిరి. ఈ విధముగా ఫినీషియా దేశస్థులు సమస్త లౌకిక విద్యలయందు నారితేరి

ప్రౌఢులై విలసిల్లిరి. కాని వీరు జిజ్ఞాసువులు కారు. లిపి నిర్మాణ సంస్కారములకు వీరెంతయో దోహదము కావించిరి. కాని వీరి బుద్ధి సంపద కావ్యనిర్మాణమునందును, గ్రంథ రచనమునందును, ఎక్కువగా ప్రకాశింపలేదు. కార్యరంగమే వీరి ప్రధాన క్షేత్రము. ఊహాప్రపంచమునందు వీరు విశేషముగా పరిశ్రమ చేసినట్లు కాన్పించదు. సంఖ్యచే కొద్దివారయ్యు, కార్యశూరత్వముచే పెద్దలైన యీ ఫినీషియావారి చరిత్రము విజ్ఞానప్రియులగువారి కెల్లరకును హృాస్యముగ నుండితీరును.

—: ఎల్లలు - దేశస్వభావము :—

మధ్యధరాసముద్రము యొక్క తూర్పుకొనయందొక చిన్న భూఖండము గలదు. దీనిని పూర్వకాలమునందు గ్రీకులును, రోమకజాతివారును ఫినీషియా యని వ్యవహరించెడివారు. ఈ భూభాగమునందు ఖర్జూరపు చెట్లు విశేషముగా పెరుగును. కావున గ్రీకుదేశమువారు దీనిని ఫినీషియా అనగా ఖర్జూర వృక్షముల దేశమని పిలిచెడివారు. ఈ ఫినీషియా ప్రాంతము విస్తృతియందు మిక్కిలి చిన్నది. హిందూదేశమునందు పశ్చిమ సముద్రతీరమున సముద్రమునకును, పడమటి కనుమలకును నడుమ కొంకణదేశమని సన్నని భూఖండమున్నట్లు మనకు తెలిసినవిషయమే. అట్లే ఆసియాఖండమునకు పశ్చిమభాగమున మధ్యధరాసముద్రమున కభిముఖముగా నీ ఫినీషియా రాష్ట్రము నెలకొనియున్నది. ఈరాష్ట్రము యొక్క పొడవు సుమారు రెండు నూర్ల మైళ్ళు. అతి విశాల

ముగ నున్న ఉత్తరప్రాంతమున నీదేశ వైశాల్యము ముప్పది మైళు మైళ్ళకు మించిలేదు. దక్షిణమున నీదేశము మిక్కిలి సన్నముగా నున్నది. ఇచ్చట నీదేశ వైశాల్యము రెండు మైళ్ళు మాత్రమే. ఈ దేశమునకు తూర్పున పర్వతములును, దక్షిణమున పాలస్తీనా దేశమును, ఉత్తరమున సిరియా రాష్ట్రమును, పశ్చిమమున మధ్యధరాసముద్రమును కలవు. ఈ దేశము యొక్క వైశాల్యము సుమారు 4000 చదరపు మైళ్ళు. ఈ చిన్న దేశమును కూడ భూగోళశాస్త్ర దృష్టిచే నాల్గు భాగములుగా విభజింపవచ్చును. సముద్రతీరమున భూమి ఇసుక మయము. ఇచ్చట ఖర్జూర వృక్షములు విరివిగా పెరుగుచు కంటికింపు గొల్పుచుండును. జాఫా, బీరటు ప్రాంతములలో నేటి కాలమున కానవగుచున్న భూస్థితియే పూర్వయుగమున సముద్రతీరమున నుండెడిది. ఈ ఇసుక నేలకు కొంచెము తూర్పున భూమి యొక్క తత్వము మారుచున్నది. ఇచ్చటి నేల మిక్కిలి సారవంతముగను, వ్యవసాయయోగ్యముగను ఉన్నది. వివిధములగు ధాన్యాదులును, ఫలవృక్షములును, పూదోటలును ఈప్రదేశమునందు పెరుగును. సస్యశ్యామలమగునీ ప్రదేశమునందెత్తైన ప్రదేశములపై పట్టణములు నిర్మింపబడుచుండెడివి. ఈ నగరములందు దానిమ్మ తోటలు, నారింజ తోటలు, విరివిగ కానబడును. తూర్పుదిక్కుగా మరి కొంత దూరము పోవుసరికి భూమట్టము ఎత్తైన పర్వతపాద భూమి యారంభ మగుచున్నది. ఇచ్చట ద్రాక్ష, ఆలివు, మల్బరీ తోటలు విస్తారముగా పెరుగును. తూర్పుదిక్కుగా మరికొంత ముందునకు సాగిపోయినయెడల మిక్కిలి యెత్త

యిన పర్వతపంక్తులు దృగ్గోచరము లగును. ఈ పర్వతము లపై మహోన్నతములగు వృక్షపంక్తులు బారులు తీర్చి యుండును. వీనియందు ఓక్, ఛెస్నట్, సెకమూర్, సీడర్ వృక్షములు మిక్కిలి ప్రశస్తి చెందినవి. వీని కఱ్ఱ గృహ నిర్మాణమునకును, నౌకా నిర్మాణమునకును, మిక్కిలి ఉప యోగపడును. ఈపర్వతపంక్తులు, ఉత్తరమున అయిదు వేల అడుగులును, దక్షిణమున తొమ్మిది వేల అడుగులును, ఎత్తుగా నుండి ఫినీషియా దేశమునకు పెట్టని కోటవలె నున్నవి. ఈ పర్వతపంక్తులు ఉత్తరమున కాసియస్ బార్గి లాస్ శ్రేణులనియు, దక్షిణమున లెబనాన్ శ్రేణులనియు పిలువబడును.

ఈ ఫినీషియా తీరమున రేవుపట్టణములుగా నుండ జాలిన ప్రదేశములుకూడ కొన్ని కొన్ని ప్రాంతములలో కలవు. అందు ముఖ్యముగా పేర్కొనదగినవి టైర్, సిడన్, అరాడస్ అనునవి. ఇవన్నియు సముద్రతీరమునకు చూపు మేర దూరములోనున్న చిన్న ద్వీపములు. ఈ ద్వీపములు కొంత మనుష్య ప్రయత్నముతో చక్కని రేవు పట్టణము లుగా మార్పబడెను. ఇవిగాక సముద్రములోనికి చొచ్చుకొనిపోయిన శిలా సమూహములు ఎత్తైన గోడలవలె నేర్ప డగా, ఆ గోడల నడుమ ఫినీషియావారు కొన్ని రేవు పట్టణ ములు నిర్మించుకొనెడివారు.

సనాతన కాలమందు, స్పార్టా, ఏథెన్సు, కార్థేజ్, రోమ్‌నగరముల వలెను, మధ్యయుగమందు వెనిస్, జెనీవా, పీసా, ఫ్లారెన్సు నగరముల వలెను, ఫినీషియా రాష్ట్రము తన

విస్తృతికి మించిన ప్రాముఖ్యతను, గౌరవమును సంపాదింప గల్గుటకు యీ దేశముయొక్క నైసర్గికములగు సానుకూల్యములే కారణభూతములు. ఈ దేశము పూర్వ, పశ్చిమములకు మధ్యమమున నున్న కారణమున నిచ్చటి ప్రజ లిర్వంకలకును నిరాఘాటముగ ప్రయాణము చేయుచు ప్రాక్పశ్చిమములకు రెంటికిని నడుమ గొలుసువలె నుండజొచ్చిరి. సముద్ర సామీప్యము వలన వీరికి నౌకా ప్రయాణములలో నేర్పు సహజముగా లభించెను. వీరి దేశము తృణకాష్ఠజలసమృద్ధమై ప్రజానీకమున కాహార పదార్థములను సమృద్ధిగ నొసంగుచుండెడిది. దేశమునకు మూడుదిశలందు పర్వతములును, పశ్చిమమున సముద్రము నుండుటచే విదేశీయుల కియ్యది దుష్ప్రాపమై శత్రువుల దండయాత్రలకు తరచుగా లోనుగాక క్షేమముగను, శాంతయుతముగ నుండెడిది: ప్రకృతిదత్తమగు సదుపాయములకు, ఫినీషియావారు తమ గుణసంపదను జోడించి, దిగంత విశ్రాంత కీర్తిని సంపాదింప గలిగిరి.

—: ప్ర జ లు :—

అతిపురాతన కాలమం దీ ఫినీషియా దేశములో నివసించిన ప్రజలు హామైటు తెగవారు. ఈజిప్టు, ఇథియోపియా, దేశములలో నీ తెగవారే వ్యాపించియుండిరి. కాని క్రీ-పూ. 2000 సంవత్సరములనుండి యిచ్చటి కొక నూతన జాతివారు వచ్చుట ప్రారంభించిరి. ఈ నూతన జా తి వా రు సెమిటిక్ తెగవారు. ఈ నూతన ప్రజలు మొట్టమొదట పర్షియా

గుడమునకు సమీపముననున్న దేశములలో నివసించుచుండి నట్లును, ఆపైన మధ్యధరా సముద్రతీరమునగల ప్రాంతములకు వలస పోయినట్లును చారిత్రకు లూహించుచున్నారు. కాని యిట్లు వలసపోవుటకుగల కారణములనుగూర్చి బిన్నాభిప్రాయములు గలవు. యూఫ్రటీసు నదీతీరమున భూకంపము సంభవించుటచే నచ్చటి ప్రజలు స్వదేశమును వీడి పర్వతప్రాంతములకు వలస పోయినట్లు కొందరి యభిప్రాయము. మరికొందరు చారిత్రికు లీ వాదము నంగీకరించుటలేదు. నూతన దేశములను కనుగొనవలెనను ఉత్సాహముతో సెమిటిక్ జాతులవారు మొట్టమొదట సిరియాదేశ ప్రాంతములకు వలస పోయియుండవచ్చు ననియు, అచ్చటికి పోయిన కొంతకాలమున కచ్చటి నైసర్గికములగు అనుకూలతలను గుర్తించి, సముద్ర వ్యాపార ప్రాంతములు మిక్కిలి అనువుగా నుండునని తలంచి అచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొని యుండవచ్చు ననియు మరికొందరి విశ్వాసము. ఏది యెట్లున్నను ఫినీషియా ప్రజలు యూఫ్రటీసు నదీతీరము నుండి వలస వచ్చిన యొక పర జాతివా రని తెలియ నగుచున్నది.

ఈ ఫినీషియా జాతివారు సెమిటిక్ తెగకు చెందినవారని తెల్పియున్నాము. యూదులు, బాబిలోనియా జాతి వారును మున్నగువారు వీరికి సన్నిహిత జ్ఞాతులు. కావుననే ఫినీషియావారి భాషకును, యూదుల భాషకును మిక్కిలి సామీప్యము ద్యోతక మగుచున్నది. రూపరేఖా విలాసాదుల యందు సైతము సెమిటిక్ జాతులవారి లక్షణములు ఫినీ

షియా ప్రజలలో కానవచ్చుచున్నవి. వీరు కేవల పాండువర్ణ మును, కేవల కృష్ణ వర్ణమును కాని గౌరవర్ణము కలిగి యుండిరి. ఫాలము విశాలముగను, ఎత్తుగను ఉండెడిది. ముక్కు కొంచెము నొక్కుపడి వంగి యుండెడిది. జుట్టు నల్ల గను, అచ్చటచ్చట వంకరలు తిరిగియుండెడిది. కాని నీగ్రో జాతివారి జుట్టువలె మెలికలు తిరిగి యుండెడిదికాదు. మొత్తముమీద వీరు ఆర్యజాతులతో పోల్చదగిన రూప సం పద కల్గియుండెడివారు. వీరు మిక్కిలి పొడవుగను, పొట్టిగను కాక మధ్యమముగా నుండెడివారు. అరబ్బులును, సిరియాదేశ స్థులును సన్నముగ నుండెడివారు. అందులకు భిన్నముగా ఫినీ షియావారు దృఢకాయులును ఇంచుక స్థూలదేహులునై యుండిరి. ఈ విషయమున వీరు యూదులను పోలియుండెడి వారు: రూపమునందేకాక గుణగణములయందుకూడ సెమిటిక్ జాతుల లక్షణములే ఫినీషియాప్రజలలో కానవచ్చుచున్నవి. సమయోచిత వర్తనము, పట్టుదల, ధైర్యసాహసములు, భోగ ప్రియత్వము, కష్టసహిష్ణుత, దైవభక్తి మున్నగు నవి ఈ జాతులలో సామాన్యముగ కాన్పించు గుణములు. ఫినీషియా దేశస్థులు వ్యాపారము నిమిత్తమై దూరప్రాంతము లకు పోవుచుండెడివారని యీవరకే తెలుపబడినది. అట్లు వీరు సందర్శించిన యన్ని దేశములలోను కూడ వీరికి స్నేహ పూర్వకమగు స్వాగతమే లభించెను. యూదులు, బాబిలోని యనులు, అస్సీరియాప్రజలు, గ్రీకులు, ఈజిప్టుదేశస్థులు, పార సీకులు మున్నగువారెల్లరును కూడ ఫినీషియావారితో మిత్ర భావము వహించుట ఫినీషియావారి సమయోచిత వర్తన

పరతకు తార్కాణము. ఈజిప్టువారు ఫినీషియాజాతి వర్తకు లకు తమ రాజధానియందు నివసించుటకు ప్రత్యేకముగ నొక భాగమును నొసంగి వారికి దేవాలయములను నిర్మించుకొనుట కనుమతినికూడ నిచ్చిరి. అస్సీరియా బాబిలోనియా ప్రభు త్వములవారు ఫినీషియా వర్తకులకు ప్రోత్సాహ మొసంగి వారి యొంటెల గుంపులను సంరక్షించుచుండెడివారు. ఈ కారణమువలననే ఫినీషియా వర్తకులు పశ్చిమ ఆసియా యందలి తమ దేశమునుండి పర్షియాగుడము వరకును తమ సరకులను నిర్భయముగా తీసికొని పోగలైడివారు. గ్రీకు దేశ స్థులు ఫినీషియావారి లిపిని, తూకమునకు సంబంధించిన వారి మానముల నంగీకరించి వీరిని తమ దేశమునకు రావలసిన దని యాహ్వానించెడివారు. వ్యాపార విషయములలో గ్రీకుల కును, ఫినీషియావారికిని స్పర్ధ యున్నను, గ్రీకువారు ఫినీ షియావారిని వేనోళ్ళ పొగడుచుండుట ముఖ్యముగా గమ నింపదగిన విషయము. పారసీక ప్రభువులు ఫినీషియా దేశీ యులను ప్రత్యేకముగా గౌరవించుచు, వారి స్వాతంత్ర్యము నకు భంగము కల్గింపక, వారికడనుండి తక్కువ పన్నులను గైకొనుచు, ఇతర విధముల వారి కనేక సహాయములను కల్పించుచు ప్రవర్తించిరి. సంఖ్య యందు మిక్కిలి అల్పు లయ్యు వేయి సంవత్సరములకు పైబడి తమ స్వాతంత్ర్యమును సంరక్షించుకొని, గొప్ప శూరు లని పేరు పొందుటయే ఫినీ షియా జాతివారి ధైర్యసాహసములకును, పట్టుదలకును నిదర్శనములు. ఈ జాతివారు ఒడలు వంచి మిక్కిలి కష్టించుట కలవాటుపడియుండిరి. వీరు నిర్మించిన భవనములును, కోట

లును, ఓడలును, మన కీవిషయమున ప్రబల సాక్ష్యము నొసంగుచున్నవి. నిర్ణీతమగు పని నెరవేరిన వెనుక వీరు కష్ట లబ్ధమైన తమ విశ్రాంతి సమయమును సౌఖ్యానుభవము నందును, భోగపరత్వమునందును గడపుచుండెడివారు. ఫినీషియావారు మిక్కిలి దైవభక్తి కల్గి యుండెడివారు. వీరి దేశమున ననేక దేవాలయములు నిర్మింపబడెను. రాజులు తాము దేవునికి పురోహితుల మని తలంచుచు, దేవపూజాదికముల యెడలను, దేవాలయ నిర్మాణము, తదలంకరణము విషయమునను ప్రత్యేక శ్రద్ధ వహించుచుండెడివారు. ప్రజలెల్లరును దేవతలకు మిక్కిలి విలువగల కానుకలను సమర్పించు చుండెడివారు. వీరు నిర్మించిన ఓడల కగ్రభాగమున దేవతా విగ్రహములు చెక్కబడుచుండెను. ఈ నౌకలకు తరచుగ దేవతల నామధేయములే యొసంగుచుండిరి. ఈ ఫినీషియావారు తామెచ్చటి కేగిన నచ్చటికి తమ దేవతావిగ్రహములను కొనిపోవుచు విదేశములలో సైతము తమ మతధర్మములను వీడక, అచ్చట దేవాలయాదులను నిర్మించుకొనుచుండెడివారు. కాని సెమిటిక్ జాతులయందు కాననగుచుండెడి తత్వజిజ్ఞాస వీరియందు కొరవడి యుండెను. సిడన్ పట్టణమందు నివసించిన యొక పండితుడు, పరమాణు తత్వమును గూర్చియు, సృష్టిక్రమమును గూర్చియు చర్చించుచు నొక గ్రంథమును వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. కాని యిట్టి పండితులీ జాతియందు స్వల్ప సంఖ్యలో కాననగుచున్నారు. ఈ జాతివారి కెన్నదగిన సాహిత్య భాండారము కూడ లేదు.

—: దేశ సంరక్షణ :—

రాజ్యాంగ విషయములయందీ ఫినీషియా దేశమెన్నడునొక రాజు పాలనకు లోబడి యుండలేదు. పూర్వకాలమునందు గ్రీకుదేశములోవలె నిచ్చటకూడ చాల ప్రభుత్వములు నెలకొనియుండెను. ఒక్కొక్క పట్టణమొక ప్రత్యేక ప్రభుత్వముగా నుండెడిది. ఇట్టి పట్టణములలో నిక్కిలి ప్రసిద్ధిచెంది ఫినీషియాదేశమునకు తలమానికమును ఫినీషియా నాగరకతకు ప్రతినిధి యనియు చెప్పదగినది టైరు పట్టణము. ఈ పట్టణము మిక్కిలి వైశిష్ట్యము గలది. ఇయ్యది ప్రకృతిచే రెండు భాగములుగ విభజింపబడెను. మొదటి భాగము ఫినీషియా తీరమునందలి పట్టణము. దీనిని పురాతన టైరు అని వ్యవహరించెడివారు. ఈ పట్టణమందలి రెండవ భాగముతీరమునకు అర్ధమైలు దూరమున సముద్రములో రెండు చిన్న ద్వీపములను కలిపి నిర్మించిన మరియొక జనావాసము. ఈ పట్టణమును నూతనటైరు అని పిలచెడివారు. పురాతన పట్టణముయొక్క వైశాల్యము సుమారు పదునేను చదరపు మైళ్ళుండెడిదట. పట్టణముచుట్టును బలమైన ప్రాకారముండెడిదట. బాబిలోనియా, అస్సీరియా రాజ్యములతో సంభవించిన యుద్ధములలో నీ పట్టణము సంపూర్ణముగ నశించినందున ఈ పట్టణమును గూర్చిన వివరము లెవ్వియును తెలియరాకున్నవి: ఫినీషియాతీరమునకు సమీపమున వరుసగ పెక్కుద్వీపములు కలవు. అట్టి ద్వీపములలో రెండింటిని కలిపి అచ్చట మరియొక పట్టణమును టైరు పౌరులు నిర్మించిరి. ఈ పట్టణ

మునం దనేక భవనము లుండెడివి. ఇవన్నియునుకూడ నాలు గైదు అంతస్తుల మేడలే. స్థలాభావముచే నిచ్చటి ప్రజలు తమ గృహములను మింటిపైపు విస్తరింప జేసెడివారు. హీరామ్ అను రాజుకాలములో ఈ రెండు ద్వీపములకు మధ్యకల జల భాగమంతయు పూడ్పింపబడెను. ఈ రాజు తమ ద్వీపమున కుత్తర భాగమున కొంతవరకు సముద్రమును కప్పించివైచి అచ్చట చక్కని భవనములను కట్టించెను. ఈ నూతన పట్టణమున కుత్తరమునను దక్షిణమునను చక్కని నౌకాశ్రయములు నిర్మింపబడెను. సముద్రముపైనుండి వీరు ప్రబలమగు వాయువునుండి తమ ఓడలను రక్షించుకొనుటకై వీరు సముద్రములోనికి గోడలను నిర్మించి తమ నౌకా బలమునకు సురక్షితమగు నిలయమును సిద్ధము కావించుకొనిరి. ఈ రెండు రేవు ప్రదేశములను కలుపుటకై పట్టణ మధ్యమునుండి యొక కాలువ త్రవ్వబడెను. కావున సముద్రమునందెట్టి తుఫాను చెలరేగుచున్నను టైరు పట్టణమువారి నౌకలు నిరాఘాటముగ ఒక రేవునుండి మరియొక రేవునకు పోగలుగు చుండెడివి. నూతన పట్టణము చుట్టును సుమారు ఏబదిగజముల ఎత్తయిన ప్రాకారము నిర్మింపబడెను. ఈవిధముగా టైరుపట్టణము శత్రుదుర్భేద్యమై, సముద్ర పరివృతమై, సకల సంపదల కాటపట్టయి యొప్పుచుండెను.

:— పట్టణములు. :—

ఫీనీషియా దేశమందలి నగరములలో నతి పురాతనమును, ప్రాముఖ్యత యందు టైరు పట్టణమున కించుక తీసి

కట్టెను, అయినది సిడన్ నగరము. ఈ పట్టణము టైరు నగర మున కుత్తరదిశయందు ఇరువది మైళ్ళ దూరమున నున్నది. సిడన్ నగరము ఫినీషియా తీరముననే నెలకొని యుండెను. తీరము నకు సమీపమున రెండు చిన్న ద్వీపములు కలవు. ఈ ద్వీపము లను చాటుగా చేసికొని నౌకాశ్రయములు నిర్మించుట కవకాశ ములు కలవు. ఈ యవకాశములను పురస్కరించుకొని సిడన్ పౌరులొక నౌకాశ్రయమును నిర్మించుకొనిరి. కాని టైరు పట్ట ణము రేవు ప్రదేశమునకుగల సౌలభ్యములీ నౌకాశ్రయమునకు లభింపలేదు. అయినను సిడన్ పట్టణమువారు నౌకానిర్వ హణమునందు గొప్ప ప్రజ్ఞావంతులుగ నుండినందున క్రీ.పూ. పదునొకండవ శతాబ్దివరకును వీరి ఖ్యాతి టైరు పట్టణము కంటె మించియుండెను. ఇచ్చటి ప్రజలు వివిధ లోహముల పై పనితనమును చూపుచుండిరి. ఈకారణమున వీరిచే సిద్ధము చేయబడిన వస్తువులు దూరదేశస్థులు విశేషముగా వాడుచుం డెడివారు. ఈ పట్టణమున సుప్రసిద్ధములగు నాలుగు దేవా లయము లుండెడివట. సిడన్ పట్టణమునకు ఉత్తరమున నేటి కాలపు బీరటు నగరము నెలకొని యున్నది. ప్రాచీన యుగ మున నీ ప్రదేశమునకెట్టి ప్రాముఖ్యతయు లేకుండెను. ఈ ప్రదేశము సిడన్ నగరమునకో, లేక ఏదైన ఇతర పట్టణమునకో లోబడియుండవచ్చును. బైబ్లస్ అను మరి యొక ప్రదేశమీ కాలములో పేరుమోసి యుండెను. ఈ పట్టణము ఫినీషియా పురాణములందు కీర్తి వహించిన కొందరు ప్రసిద్ధ పురుషులకు నివాసస్థలముగా నుండెడిది. ఈ పట్టణమువారు పెద్ద పెద్ద శిలలను చెక్కి వివిధ భవన

నిర్మాణమున కనుకూల మగు నాపరాళ్ళను సిద్ధపరచుటలో మిక్కిలి నేర్పరులుగ నుండెడివారు. సాలమన్ రాజుచే నిర్మింపబడిన దేవాలయమునందు వీరి పనితనము కానవచ్చుచున్నది. ఓడలను సిద్ధపరచుటయందుకూడ వీరికి ప్రావీణ్యముండెను. కావున టైరు పట్టణమువారు తమ యోడలలో నీరు చొరకుండు నట్లుగా వీరిచే సిద్ధము కావించుచుండిరి. ఈబైబ్లస్ పట్టణ మొక స్వతంత్రరాజు పరిపాలనమందున్నట్లు అస్సీరియావారి శాసనాముల వలన తెలియనగుచున్నది. బైబ్లస్ పట్టణమున కుత్తరమున ముప్పది మైళ్ళ దూరమున ట్రిపోలిస్ అను మరియొక జనపదము కలదు. ఇయ్యది సముద్రములోనికి చొరుచుకొనిపోయిన యొకయెత్తైనరాతి ప్రదేశముపై నిర్మింపబడెను. ఈ పట్టణమునకుకూడ సమీపమున కొన్ని ద్వీపములుండిన కారణమున నిచ్చటి ప్రజలు సామాన్యమైన యొక రేవుప్రదేశమును నిర్మించుకొనిరి. ట్రిపోలిస్ పట్టణమునకు సమీపమున పూరాథన్, సెమీరా అను రెండు చిన్న పట్టణము లుండెను. ఈ పట్టణములకు చుట్టుప్రక్కల నుండెడి భూమి సారవంతముగా నుండెడిది. కావున కొందరు ప్రజ లిచ్చటనే నివాస మేర్పరచుకొనిరి. వీరు సముద్రయానము నెడ శ్రద్ధకాని, నేర్పుకాని చూపనందున వీరి సంపదయు ప్రాముఖ్యతయు విశేష మభివృద్ధి చెందలేదు. ఫినీషియా దేశపు పట్టణములలో విఖ్యాతి గాంచినది అరాడస్ నగర మొకటి. ఇయ్యది సముద్రతీరమునకు మూడు మైళ్ళ దూరముననున్న యొకశిలామయమగు ద్వీపముపై నిర్మింపబడెను. ఈ పట్టణమున కెదురుగా సముద్ర తీరమున కార్నస్ అను

రేవు ప్రదేశముండెడిది. అరాడస్ పట్టణమునకు తూర్పు భాగమున మరి రెండు చిన్న రేవు లుండెడివి. ఈ పట్టణము వారు నగరరక్షణమునకై గొప్ప ప్రాకారమును నిర్మించుకొనిరి. ఈ ప్రాకారము అయిదారు గజముల పొడవుగల బ్రహ్మాండమగు రాతిపలకలచే సిద్ధము చేయబడి, శత్రు దుర్భేద్యముగా నుండెను. ఈ ద్వీపమునందు మంచి నీరు లభించెడిదికాదు. కావున నచ్చటి ప్రజలు వర్ష జలమును పెద్ద పెద్ద జలాగారములలో నిలువచేసి యుంచెడివారు. అంతేకాక తీరమునకు, ద్వీపమునకును నడుమ సముద్రమధ్యమున ఏబది మూరల లోతు నుండి యొక మంచినీటి చెలను పొంగుచుండెడిది. ఆ ప్రదేశమున నొక గొట్టమును సముద్రములోనికి దించి మంచినీటిని నొక తోలుతిత్తి ద్వారా పెద్ద పెద్ద కుండలలోనికి పంపుచుండెడివారు. అరాడస్ పట్టణమున కేబది మైళ్ళ దూరమున నుత్తరభాగమునందు రామాంధ యను పట్టణ ముండెడిది. ఇయ్యది ఫినీషియా దేశమున కుత్తరపు సరిహద్దు. ఈ పట్టణము ఫినీషియా దేశములో కెల్ల మిక్కిలి పురాతనమైనదని కొందరు గ్రీకు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు కాని యిందులకు తగిన యాధారములు లేవు. ఫినీషియా దేశముయొక్క దక్షిణపు కొనయందు అక్కో అను మరియొక పట్టణము నెలకొని యుండెను. దీని నాధునికులు ఏకర్ (ACRE) అని వ్యవహరించుచున్నారు. ఈ పట్టణము నాటి నుండి నేటి వరకును కూడ ప్రసిద్ధి కల్గియున్నది. మధ్యమ యుగమునందు తరచుగ సంభవించుచుండిన మత యుద్ధము (CRUSADES)లలో నీఏకర్ పట్టణమునకు మిక్కిలి ప్రాధా

స్వతంత్ర యుండెను. ఈ అకో పట్టణము చక్కని నౌకాశ్రయముగా నుపయోగించు చున్నది. ఈ రేవుపట్టణము పాలస్తీనా దేశమునకు ముఖద్వారముగ నున్నందున దీని ప్రాధాన్యత విశేషముగా నుండెను. ఇచ్చటి రాజులను టైరు సిడన్ పట్టణముల పాలకులతో తుల్యులుగా అస్సీరియా చక్రవర్తులు గౌరవించు చుండిరి.

పైన ఉదహరింపబడిన పట్టణము లన్నియు స్వతంత్ర రాజులచే పరిపాలింప బడుచుండినను పరస్పర మైత్రితో వర్తించెడివారు. యుద్ధము సంప్రాప్తమైనప్పుడు రాజు లెల్లరును తమ సైన్యములను, నౌకలను కలుపుకొని శత్రువుల నెదుర్కొనెడివారు. అట్టి సమయములలో టైరు పట్టణపు రాజు కాని, సిడన్ పట్టణపు ప్రభువు కాని వీరికి నాయకత్వము వహించెడివాడు. కాని మొట్టమొదటి నుండి యు నీ ఫినీషియా రాజ్యముల బలము లోపభూయిష్ఠముగనే యుండెను. ఈ రాజ్యము లన్నియు సమకూడి సిద్ధపరుపగల్గిన సేన సైతము మిక్కిలి స్వల్పముగా నుండెడిది. ఆసియాఖండములోని యితర రాజ్యములవారి సైన్యము నవలీలగ యోడింప గల్గుచుండిరి. అంతటితో ఈ రాజ్యముల సంఘీభావము విచ్ఛిన్న మగుచుండెడిది. ఆపిమ్మట శత్రురాజులొక పట్టణము తరువాత వేరొక పట్టణమును ముట్టడించి క్రమముగా నన్నిటిని గూడ వశపరచుకొను చుండిరి. ఇంతే కాదు. ఒక పట్టణము శత్రు హస్తగత మగుటతోడనే ఆ పట్టణమువారి నౌక లన్నియు శత్రువులకు లోబడిపోవుచుండెడివి. ఆ నౌకాబలమునే ఉపయోగించి శత్రురాజులు ఫినీషియా దేశమందలి

యితర పట్టణములను సైతము వశపరచుకొను చుండిరి. ఈ విధముగా ఫినీషియా రాజ్యములు అస్సీరియా, బాబిలోనియా, పర్షియా, మాసిడోను రాజులచే జయింపబడెను. ఈ సందర్భము లన్నిటియందును ఫినీషియా నౌకలే ఆ దేశపు పట్టణములను జయించుటకు కారణభూతము లయ్యెను.

## —: నా వి కు లు :—

ఫినీషియా దేశస్థులు గొప్ప నావికులుగను, వ్యాపారస్థులుగను ప్రసిద్ధి చెందినట్లు మన మిదివరకే తెలిసికొని యున్నాము. వర్తకము నిమిత్తమై యితర దేశములకు పోయినప్పుడు వారా యా ప్రాంతములలో తాత్కాలికముగ నివాసము నేర్పరచుకొను చుండెడివారు. ఆ తాత్కాలిక నివాసములు కొంతకాలమైన తరువాత శాశ్వత నివాసములుగ మారి ఫినీషియా వర్తకుల వ్యాపార కేంద్రములుగ పరిగణించు చుండెడివి. ఫినీషియా వర్తకుల వలస ప్రదేశములను గూర్చి తెలిసికొనిన యెడల వారి వ్యాపార పరిమితియు, వారి యుత్సాహము, ధైర్యసాహసములును వ్యక్తమగును. ఈ వర్తకులు ప్రప్రథమమున ఈజిప్టు, సిలీసియా, సైప్రస్ ద్వీపములలో వ్యాపార కేంద్రములను స్థాపించుకొనిరి. ఈజిప్టు దేశమంజలి మెంఫిస్ పట్టణములో నిట్టి ముఖ్య వర్తక స్థాన ముండెడిది. ఈజిప్టు దేశమునుండి దంతములు, నల్లసీసపు కట్టె (EBONY) తోళ్ళు, ఆస్ట్రిచ్ పక్షి యీకలు, జిగుళ్లు, రత్నములు. ధాన్యములు, వస్త్రములు, అలంకార ద్రవ్యములు, మట్టి సామానులు, గాజు సామానులు మున్నగు అనేక పదార్థములను వీరు ఆసియా మైనరు, గ్రీకు దేశముల

కెగుమతి చేయుచుండెడివారు. ఈ మెంఫీస్ పట్టణమందు ఫినీషియా వర్తకులు క్రీ పూ - 1200 ప్రాంతమున ప్రత్యేక దేవాలయమును నిర్మించుకొని నట్లు హెరోడోటస్ అను చరిత్రకారుడు తెలుపుచున్నాడు. మెంఫిస్ నగరమునందు వర్తక కేంద్రమును నెలకొల్పిన వ్యాపారస్థులు టైరు పట్టణము వారు. ఇదే విధముగా అరాడిస్, ట్రిపోలిస్ పట్టణముల వారు సిలీసియా ప్రాంతమునకు వెడలిరి. ఈ ద్వీపమునకు ముఖ్య పట్టణమగు టార్సస్ నగరమును ఫినీషియా వాచే స్థాపించినట్లు నిదర్శన పూర్వకముగా తెలుపవచ్చును. ఇచ్చట ఫినీషియా వారికి నావలు నిర్మించుటకు అనుకూలమగు కట్టె విస్తారముగ లభించెడిది. సైప్రస్ ద్వీపము నందలి దక్షిణ ప్రాంతమునను, తూర్పు ప్రాంతమునను వీరు తమ వర్తక స్థానములను నెలకొల్పిరి. ఇచ్చట రాగి, వెండి, బంగారములును, మంచి కట్టెయును, ధాన్యములు, సారాయములు, నూనె, వజ్రములు మున్నగునవి లభించు చుండెడివి. సైప్రస్ ద్వీపమున ఫినీషియా నాగరికత యొక్క చిహ్నములు విరివిగ కాన్పించు చున్నవి. మధ్యధరాసముద్రము నందలి రోడ్సు, క్రీటు ద్వీపములలో కూడ ఫీనీషియావారి వర్తకము విస్తారముగా సాగుచుండెను. రోడ్సు ద్వీపములో నౌకాశ్రయములు పెక్కులు గలవు. ఇచ్చట అనేక విధములగు ఫల వృక్షములు పెరుగుచుండును. ద్రాక్షలు, దానిమ్మలు, ఆలివు వృక్షములు, మున్నగు వానికి ద్వీపము పేరు మోసెను. క్రీటు ద్వీపమును కూడ ఫి నీ షి యా వారాక్రమించిరి. కాని కొంతకాలమైన వెనుక గ్రీకులీ ద్వీపములోనికి

వలన రానారంభించి నందున వారితో పోరాడుట కిష్టములేక ఫినీషియా వారితర ప్రాంతములకు వెడలిపోయిరి. గ్రీకు పురాణములలో క్రీటు ద్వీపమును గూర్చిన కథ లన్నియును ఫినీషియా వారినుండి గైకొనబడినవే. ఈ ప్రాంతము లందలి అనేక ద్వీపములలో కూడ ఫినీషియా వర్తకులు తమ వర్తక స్థానములు నెలకొల్పిరి. వీరు డార్డనల్సు జలసంధి వరకును పోయినట్లు నిదర్శనములు కలవు. కాని నల్ల సముద్రమును ప్రవేశించినట్లు మాత్రము తెల్పుటకు వీలులేదు. గ్రీసు దేశము లోని కొన్ని పట్టణములలో కూడ వర్తకము సాగించు చుండిరి. ఆఫ్రికా ఖండమునందు ఫినీషియావారి వ్యాపార కేంద్రములు నెలకొని యుండుట కవకాశే తెలుపబడినది. ఇచ్చటి పట్టణములలో యూటికా అను నది చాల ప్రసిద్ధి చెందెను. ఇచ్చట వివిధములగు ధాన్యములు, లోహములు మున్నగునవి లభించెడివి. ఆఫ్రికా ఖండములో ఫినీషియా వారు స్థాపించిన వలస ప్రదేశములలో మిక్కిలి పేరు మోసి జగత్ప్రసిద్ధిని గాంచినది కార్థేజ్ నగరము.

ఆఫ్రికా ఖండము నుండి వీరు మరల ఉత్తర దిక్కుగ పోయి సిసిలీ ద్వీపమును ఆక్రమించిరి. ఇచ్చటి ముఖ్య నౌకా శ్రయమగు పలార్మో నగరములో ఫినీషియావారు వర్తకము చేసెడివారు. ఈనాడు మనము స్పెయిను అని పిలుచుచుండెడి ఐబీరియా ద్వీపకల్పము నందుకూడ ఫినీషియావారు తమ వ్యాపారమును దిగ్విజయముగ నడిపిరి. ఇచ్చట గోధుమలు, సారాయములు, నూనె, ఉన్ని, బంగారము, వెండి, పాదరసము, తగరము, రాగి, ఇనుము మున్నగునవి లభించు చుండె

డివి. ఇచ్చట సముద్రమునందు మేలిరకపు చేపలు లభ్యమగు చుండెను. ఫినీషియా వర్తకులు వీటి నన్నిటిని విదేశములకు పంపుచుండెడివారు. ఈనాడు కాడిజ్, మలాగా, అని పిలువ బడుచున్న రేవు పట్టణముల ప్రాశస్త్యమును కనుగొని ఫినీషియావారు వీనిని తమవర్తకమునకై ఉపయోగపరచుకొనిరి. ఈ వర్తకులు కావించిన సాహస కార్యములలో పేర్కొనదగినది జిబ్రాల్టర్ జలసంధిని దాటి, అట్లాంటిక్ మహాసముద్రమును ప్రవేశించి బ్రిటిషు ద్వీపమును చేరుట. ఆ కాలమునందు బ్రిటను ద్వీపము తగరపు గనులకు ప్రసిద్ధి చెందియుండెను. ఫినీషియా వర్తకులు బ్రిటను ద్వీపము నుండి తగరమును సంపాదించుచుండెడివారు. ఆకారణముచే వీరు వీనిని తగరపు దీవులని పిలచెడివారు. అప్పటి కాలములో బ్రిటను దేశస్థులు కేవల పశుప్రాయులుగ నుండెడివారని ఫినీషియా వర్తకుల వర్ణనలవలన తెలియుచున్నది. ఈవిధముగ ఫినీషియా వ్యాపారులు పురాతన కాలమందే ప్రపంచమందలి వివిధ ప్రాంతములకు పోవుచు, వ్యాపారము సాగించుచుండుట గమనింప తగియున్నది.

ఫినీషియావారు ఉపయోగించెడి పడవలు మిక్కిలి సామాన్యముగ నుండెడివి. మొట్టమొదట ఈ పడవలకు పైన ఎట్టి కప్పును ఉండెడిది కాదు. కొంతకాలమైన తరువాత పడవలలో కొంతభాగమునకు కప్పు సిద్ధము చేయసాగిరి. ఈ పడవలలో కొన్ని పొట్టిగను, గుండ్రముగను ఉండెడివి. మరి కొన్ని బాగుగా పొడవైనవి. ఈ పడవలను నడపుటకు తెడ్లు విరివిగా వాడబడు చుండెను. పెద్ద నౌకల యందు ముప్పది

మంది నావికులు తెడ్లను ఉపయోగించుచు పడవలను నడపు చుండెడివారు. తెరచాపలను కూడ వీరు విరివిగా వాడు చుండిరి. గాలి అనుకూలముగనున్న సందర్భములలో తెర చాపల నెత్తిన యెడల పడవలు వేగముగా ప్రయాణము చేయగలవు. ఈ పడవలను నిర్మించుటకు వలయు కట్టె లెబ నాన్ కొండలపై ఫినీషియావారికి విస్తారముగ లభ్యమగు చుండెడిది. ఇట్టి పడవల యందు ఫినీషియా నావికులు మధ్య ధరాసముద్రము నంతను శోధించి అచ్చటి ప్రతి చిన్న ద్వీప మునకును కూడ పోవుచుండెడివారు. అట్లాంటిక్ మహాసము ద్రమునందును, హిందూమహాసముద్రమునందును ప్రయాణము చేయుట కలవాటుపడి, అచ్చటి భయంకరములగు తుపానుల నెరింగిన నేటివారు విశాల తటాకతుల్యమగు మధ్యధరాసము ద్రము నందు మాత్రము సంచరించిన ఫినీషియా నావికులను పరిహసింపవచ్చును. కాని యీ సముద్రమునందలి తుపాను లును, వాయువులును కూడ మిక్కిలి ఉపద్రవకరమైన వని, అచ్చట ప్రయాణము చేసిన వారెల్ల రెరుంగుదురు. పూర్వ కాలము నందు నావికులెల్లరును తమ పడవలను, తీరమునకు కనుచూపు దూరమునుండి నడపించుచు సుదూరప్రయాణములు కావించెడివారు. ఫినీషియా నావికులు కూడ ఈ పద్ధతినే అవలంబించిరి. తాళప్రమాణమగు తరంగములచే సంక్షుభిత మగు మహాసముద్రములోనైన ప్రయాణము చేయవచ్చును గాని శిలామయమగు సముద్రతీరమునకు సమీపమున పడవ లను నడుపుట మిక్కిలి కష్టసాధ్యము. ఇట్టి దుస్తరమగు ప్రయాణములను తరుచు జయప్రదముగ సాగించుచుండెడి

ఫినీషియా నావికుల నేర్పు ప్రశంసాపాత్రముకాదని యెవ్వరనగలరు? ఆకాలమునందు మధ్యధరాసముద్రమునం దోడదొంగల గుంపులు విస్తారముగా నుండెడివి. ఫినీషియా వర్తకులు మిక్కిలి విలువగల వస్తువులను తమ యోడలలో నింపుకొని ప్రయాణము చేయుచుందు రను ప్రతీతి యున్నందున ఓడ దొంగలు వెంటబడి పోవుచుండు ఫినీషియా నౌకల నెదిరించి, కొల్లగొట్టి. అందలి నావికులను బంధించి విదేశములలో వారిని బానిసలుగ విక్రయించుచుండిరి. ఇట్టి యాపదలు సంభవించకుండుటకై ఫినీషియా వర్తకులు తరచుగ చాల నౌకలను సమకూర్చుకొని ప్రయాణము చేయుచుండెడివారు.

-: వ్యాపారము :-

వీరు తమ వ్యాపార విషయములందు న్యాయమార్గమును తప్పక వర్తించెడివారు. ఈ వర్తకు లమ్మకమునకై తెచ్చెడి వస్తువులలో నెట్టి మోసము నుండెడిదికాదు. పై మెరుగులు కల్పించి బూటకపు సరకుల నెక్కువ ధరకు విక్రయించుట వీరి సిద్ధాంతములకు విరుద్ధము. కావుననే వీరి వ్యాపారము దిన దినాభివృద్ధి గాంచి యన్ని దేశములందును వ్యాపించెను. ఫినీషియావారిచే విక్రయింపబడెడి వస్తువుల ప్రాశస్త్యము గ్రీకు పురాణముల యందెన్నియో సందర్భములలో ప్రశంసింపబడెను. వీరిచే సిద్ధము చేయబడిన వస్త్రములు, లోహపు సామానులు, గాజు సామానులు మున్నగునవి చాల నాణ్యముగ నుండెడివి. ఏకిలస్ అను గ్రీకు వీరుడొక పోటీ నేర్పరిచెను. ఆ పోటీ యందు జయముపొందిన యువకు

నికి బహుమానముగా నొసంగుటకై ఆతడు సిడన్ పట్టణము వారిచే సిద్ధము చేయబడిన యొక చక్కని గిన్నెను ఏర్పాటు చేసెను. ఇయ్యది పనితనమునకును, అందమునకును, అద్వితీయముగ నుండెనని ఆనాడు తలంపబడెను. మెనిలాస్ అను మరియొక గ్రీకు వీరుడు టెలిమాకస్ అను యువతీమణికి బహుమానముగ తనవద్ద నున్న అత్యుత్తమ వస్తువు నొసంగుటకై నిశ్చయించి బంగారు అంచు గల్గిన వెండి గిన్నెనొక దాని నందుల కర్హమైనదని నిర్ణయించెను. ఈ గిన్నె సిడన్ రాజు స్వయముగా మెనిలాస్ వీరునకు బహుమానముగా నొసంగినది. గ్రీకు దేశమునందలి, ఉన్నత కుటుంబము లందలి స్త్రీలెల్లరును కూడ ఫినీషియాదేశపు వస్త్రములనే వాడుచుండిరి. ఈ వస్త్రములు వింతవింతల రంగులతో నక్షత్రములవలె ప్రకాశించుచుండెనట. కార్థేజి నగరము నుండి బయలువెడలు వర్తకులుకూడ మిక్కిలి శ్రేష్ఠమగు వస్తువులనే అమ్మకమునకు గొనిపోవుచుండెడివారట. వీరు తమ వ్యాపారమునందెట్టి మోసమునుకూడ లేకుండ వర్తించెడివారు. ఈ వర్తకులు ఆఫ్రికాఖండమునందలి అనాగరిక ప్రజలతో వర్తకము సాగించెడివారు. వీరి వర్తక పద్ధతులు అపూర్వముగ నుండెడివి. కార్థేజి వర్తకులు తమ నౌకలలో వివిధ వస్తువులను నింపుకొని ఆఫ్రికా తీరమునకుపోయి తమ సరకుల నన్నింటిని దించుకొని వానిని సక్రమముగా వరుసలు క్రింద ఏర్పాటు చేయుచుండెడివారు. ఆపైన తాము వచ్చినట్లు ప్రజలకు తెలుపుటకై పెద్ద మంటలు రగుల్కొలుపుచుండిరి. ఆ మంటలను చూచి ఆఫ్రికా ప్రజలు గుంపులు

గుంపులుగావచ్చి సముద్రతీరమునగల వస్తువుల నన్నటిని పరీక్షించి తమకు న్యాయమనితోచినంత బంగారము నావస్తువు నకు సమీపమున నుంచి దూరముగ తొలగుచుండిరి. తమ యోడలలో కనిపెట్టుకొనియున్న శాంత్రీజవర్తకు లప్పుడు తీరమునకువచ్చి, బంగారమును చూచుకొని తమ కంగీకారమైన పక్షమున బంగారమును తీసికొని వస్తువులను విడచి పోయెడివారు. లేనిపక్షమున వస్తువులను బంగారమును అచ్చటనే యుంచి మరల తమ యోడలలోనికేగి ఓపికతో నిరీక్షించెడివారు. అప్పుడు వస్తువులను కొనదలచినవారు మరల వచ్చి మరికొంత బంగారము నచ్చట పెట్టి తొలగిపోయెడివారు. ఎవ్వరును కూడ ఇతరుల వస్తువుల నక్రమముగా తీసికొనుటకు ప్రయత్నించెడివారుకారు. వ్యవహారము పరిష్కారమైన వెనుక వర్తకులు తమ బంగారమును, ప్రజలు తమ వస్తువులను గైకొని వెడలిపోవుచుండిరి. ఫినీషియా వర్తకు లప్పుడప్పుడు న్యాయమగు వర్తకమునకుతోడు నిస్సహాయులుగానున్న ప్రజలను దొంగిలించి వారి నితర దేశములలో బానిసలుగా విక్రయించెడివారు. కాని యిట్టి వ్యాపారము కదాచిత్తుగ మాత్రము సాగుచుండెడిది. బానిస వ్యాపారమునే ముఖ్యముగా చేసికొనిన పక్షమున ఫినీషియా వర్తకుల కితర రాష్ట్రములలో స్నేహపూర్వకమగు స్వాగతము లభించుట దుస్తరమై యుండెడిది.

-: రాజ్యాంగ చరిత్ర :-

ఫినీషియాదేశపు రాజ్యాంగ చరిత్రను సంపూర్ణముగ వ్రాయుట అలవికాని విషయము. ఈదేశ మేకాలమందును

కూడ ఒకేరాజు నధికారములో నుండలేదు. ఇచ్చటిపట్టణములలో వేర్వేరు రాజులు రాజ్యపాలనముచేయుచు స్వతంత్రముగ నుండెడివారని యీవరకే తెలిపియున్నాము. ఈ పట్టణములన్నిటి చరిత్రలును లభ్యమగుటలేదు. కాని వీనికన్నిటికిని నాయకత్వమును వహించి ఫినీషియాసభ్యత కుత్తమ ప్రతినిధియైనది టైరు పట్టణము. పూర్వకాలమునందు గ్రీకుదేశములో కూడ నిట్టి స్వతంత్ర పట్టణములు విస్తారముగా నుండెను. అందు ఏథెన్సునగరము విశ్వవిఖ్యాతిని వహించెను. ఏథెన్సు నగరముయొక్క చరిత్ర నెరింగిన యెడల ప్రాచీన గ్రీకు వైభవమును తెలిసికొనినట్లు తలంపవచ్చును. ఆ సామ్యము ప్రకారము టైరు పట్టణము యొక్క చరిత్ర నెరింగిన యెడల ఫినీషియా నాగరకత నవగతము చేసికొనినట్లు మనము తలంపవచ్చును. కావున టైరు నగరముయొక్క చరిత్రకే యిందు ప్రాధాన్యత యొసంగబడును.

సిడన్ పట్టణము టైరు పట్టణముకంటె మిక్కిలి ప్రాచీనమైనది. ఈపట్టణమువారు గొప్ప నావికులుగ ప్రసిద్ధి గాంచిరి. వీరికడ చక్కని పరిశ్రమలు వెలసెను. లోహపు పని, బట్టల నేతల యందు వీరందెవేసిన చేయి. ఈ సుప్రసిద్ధ నగరము క్రీ. పూ. 1300 ప్రాంతమున ఫిలిస్టయినుజాతివారిచే ముట్టడింపబడెను. ఈ ముట్టడియందు సిడన్ నగరము చాల నష్టమునకు లోనయ్యెను. ఈకారణముచే సిడన్ పౌరులు పలువురు తమ పట్టణమును విడచి టైరు పట్టణమునకు వలస పోయిరనియు, టైరు పట్టణపు ప్రాముఖ్యత కిదియే ప్రారంభ

మనియు పలువురు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. కాని యీవాక్యముతో విశ్వాసయోగ్యముగ కాన్పింపదు. సిడన్ నగరముయొక్క పతన మునకు, టైరు నగరాభివృద్ధికిని నడుమ రెండు శతాబ్దుల కాలము గడచెను. సిడన్ నగరము క్రమ క్రమముగా క్షీణదశలోనై యుండవచ్చును. కాని పైవాదము ప్రకారము శత్రురాజుల ముట్టడి యిందులకు కారణమై యుండదు. అత్యుచ్ఛదశను పొందిన ప్రతి జాతియందును భోగపరత్వమును, సుఖాభిలాషయు వృద్ధిచెందుట సహజము. భోగలాలసత దేహమనోదార్ఢ్యములనునశింపజేయును. ఇదియే క్షీణతకు ప్రథమ సోపానము. సిడన్ నగరమువారి యట్టి భోగ ప్రియత్వము వలననే క్షీణదశను పొందిరనియు, ఈ యదను నందు వారి సోదరులగు టైరు పట్టణమువారు తమ పరిశ్రమ లను, వ్యాపారమును, వృద్ధికావించుకొని ఫినీషియాపట్టణము లలో నగ్ర స్థానమును వహించియుండిరనియు తలంచుట యెక్కువ సమంజసముగా తోచుచున్నది.

## -: హీరామ్ రాజు :-

క్రీ. పూ. 1100 ప్రాంతమున టైరు నగరము క్రమ క్రమాభివృద్ధి చెందుచుండుట మనము గాంచవచ్చును. సిడన్ పట్టణపు నావికులు ఆఫ్రికాఖండమునందలి మధ్యభాగము వర కును ప్రయాణము చేసి, అచ్చట తమ వర్తక కేంద్రములను స్థాపించియుండిరి. కాని టైరు పట్టణపు నావికులు మధ్యధరా సముద్రమును పూర్తిగాదాటి జిబ్రాల్టరుజలసంధిగుండ అట్లాం టిక్ మహాసముద్రమును ప్రవేశించి బ్రిటిషు ద్వీపమును

జేరిరి. ఐబీరియా ద్వీపకల్పమే భూమండలమునకు తుదిభాగ మనియు, అచ్చటి సముద్రములోనే సూర్యుడు సాయంకాలమున మునిగిపోవుననియు, ఆ ప్రదేశములలో భయంకర రాక్షసులు నివసించుచుందురనియు, ప్రజా సామాన్యము తలంచుచుండెను. అట్టి భయానక ప్రాంతములకు పోవగల్గుట టైరు నావికుల నిర్భయత్వమునకు తార్కాణము. టైరు పట్టణము అభివృద్ధి కావించిన రాజు హీరామ్ అనునతడు. ఈ రాజు అబిబాల్ అనునాతని కుమారుడు. హీరామ్ రాజు తన పందొమ్మిదవ సంవత్సరమున సింహాసన మధిష్ఠించెను. ఈతడు టైరు పట్టణమును విశాలముగ గావించి, నూతన మందిరములను, దేవాలయములను నిర్మించెను. టైరు పట్టణమందలి రేవు ప్రదేశములను విశాలముగ గావించి వాని నీతడు పునఃనిర్మించెను. ఈ రాజునకు ఫినీషియా దేశమునందు కూడ రాజ్యభాగము లుండుట వలన నొకపర్యాయ మీతడు తన సైన్యములతో శత్రుసంహారమునకై లెబనాన్ కొండల వరకును పోయెను. ఈ దండయాత్రయందాతనికి పాలస్తీనా దేశమునందలి జుడా రాజ్యమునకు పాలకులైన యూదు ప్రభువుల వైభవము తెలియవచ్చెను. డేవిడ్ అను యూదు రాజు హీరామ్‌నకు సమకాలీనుడు. ఈ యూదురాజు తన పరాక్రమముచే శత్రువుల నెల్ల యోడించి తన రాజ్యమును బలవత్తరము కావించుకొనెను. హీరామ్‌నకు డేవిడ్ యొక్క కీర్తియు, ఆతని సాహస పరాక్రమములును తెలియవచ్చినందున నిట్టి బలాఢ్యునితో స్నేహభావమున వర్తించుట శ్రేయస్కరమని నిశ్చయించుకొని

తనసంతటతానే డేవిడ్ రాజునొద్దకు మిత్రభావమును ప్రకటించుటకై రాయబారులను పంపెను. ఈ రాయబారులు లెబనాన్ కొండలలో పెరుగు సీడరు వృక్షముల కర్రను డేవిడ్ రాజున కుపాయనముగ గైకొనిపోయిరి. డేవిడ్ రాజు జెరుసలేమ్ నగరమున తనకొరకొక రాజప్రాసాదమును నిర్మించుకొనబోవుచున్నట్లు తెలిసికొని, ఏతద్భవన నిర్మాణమునందు సహాయపడుటకై తనరాజ్యమునుండి మిక్కిలి నేర్పరులైన పనివాండ్రను పంపెదనని హీరామ్ రాజు డేవిడ్ రాజునకు వర్తమాన మంపెను. డేవిడ్ రాజీ ఉపాయనములను, హీరామ్ వాగ్దానముచేసిన సహాయమును సంతోషపూర్వకముగా నంగీకరించెను. ఫినీషియా పనివాండ్రు తమ తమ పనిముట్లను గైకొని పాలస్తీనా దేశమున కేగి డేవిడ్‌రాజు నిమిత్తమై జెరూసలేమ్ నగరమునం దొక గొప్ప రాజభవనమును నిర్మించిరి. డేవిడ్‌రాజీ సహాయమున కెంతయో సంతసించెను. జెరూసలేమ్ నగరమున నొక యపూర్వ దేవాలయమును నిర్మించు నుద్దేశ్యముతో డేవిడ్ ప్రభువు తన రాజ్యకాలమునందలి తుదిభాగమున నావశ్యకమగు వస్తుసామగ్రిని సమకూర్చుకొనుటకై ప్రయత్నములు ప్రారంభించెను. ఇట్లు సమకూర్చిన వస్తుసామగ్రియందు హీరామ్ రాజుచే వాగ్దానము కావింపబడిన 'ఉన్నతజాతి సీడరు వృక్షములు' కూడ చేరియుండెను. కాని జెరూసలేమ్ నగరము నందలి ప్రసిద్ధ దేవాలయమును నిర్మాణము కావించు నదృష్టము డేవిడ్ ప్రభువునకు లభింపలేదు. ఈతని మరణానంతర మీతని కుమారుడగు సాలమన్ అనునాతడీ ఘనకార్యమునకు బూను

కొనెను. సింహాసన మధిష్ఠించిన కొంతకాలమునకు సాలమన్ రాజు హీరామ్‌నకొకలేఖ వ్రాసెను. "మీరు నాతండ్రియైన డేవిడ్ రాజునకు నూతన భవన నిర్మాణమునందు చాలసహాయము చేసియుండుట నేనెరుంగుదును. ఆతనియెడ మిత్రభావమును చూపినట్లే నాయెడల కూడ మైత్రిని వహించి నేను పూను కొనిన ఘనకార్యములందు చేదోడువగుదురని తలంచుచున్నాను. నేను జెరూసలేమ్ నగరమున యెహోవా దేవుని కై యొక బ్రహ్మాండమగు దేవాలయమును నిర్మించు నుద్దేశ్యముతో నున్నాను. యెహోవా దేవతాసార్వభౌముడు. ఆతని గొప్పతనమునకు తగిన దేవాలయమును నిర్మించుట నా యభిమతము. ఈఘనకార్యమునందు మీరు నాకు కావలసిన సహాయమును కావింతురని నమ్ముచున్నాను. బంగారము, వెండి మున్నగు లోహములపై పనిచేయుటయందు నిపుణులగు పనివాండ్రను నా కడకు పంపగోరెదను. అదియునుగాక యీ దేవాలయ నిర్మాణముకొరకై తగిన కలపను కూడ మీ దేశమునుండి పంపవలయును. మీ కార్మికులకు నేను ఇరువదివేల మానసుల గోధుమలను, అన్నియే మానసుల బార్లీయును, ఇరువది వేల మానసుల మద్యమును, నూనెను ఈయగలను." ఈవిధముగ సాలమన్ రాజు హీరామ్‌నకు సందేశమంపెను. పాలస్తీనా దేశమునందు గోధుమలు మున్నగు ధాన్యములును, మద్యము, నూనె మున్నగునవి విశేషముగ లభ్యమగుచుండెను. ఫినీషియావారికీ వస్తువు లెంతయో యావశ్యకముగ నుండినందున వారు తమదేశములో విస్తారముగ లభించు కట్టెను పాలస్తీనాకు పంపి వారి

వద్దినుండి గోధుమలు మున్నగునవి తీసికొనుటకు సంతోష పూర్వకముగ నంగీకరించిరి. అదియునుగాక పాలస్తీనా యందు నేర్పరులగు కర్మకారులు విశేషముగ లేకుండిరి. కావున తమ దేశపు పనివాండ్ర నచ్చటికి పంపి ఆవిధముగ యూదు రాజుల స్నేహమును సంపాదించుటకై హీరామ్ రాజు చాల ఉత్సాహమును చూపెను.

హీరామ్ రాజుచే పంపబడిన కర్మకారులలో వజ్రదంగులు, తాపీ పనివాండ్రు, రాతి పనివాండ్రు, లోహకారులు, చెక్కడపు పనివాండ్రు మున్నగువారు చేరియుండిరి. పాలస్తీనా యందుగల కూలీలు కేవలము కాయకష్టముచేయు పనులలో నియోగింపబడుచుండిరి. సున్నితమైన పనులను ఫినీషియా నుండి వచ్చిన నిపుణులు నిర్వహించుచుండిరి. ఫినీషియా కర్మకారులలో అద్భుత బుద్ధివిశేషముగల శిల్పి యొకడుండెను. అతని నామధేయముకూడ హీరామ్. ఈతడు సమస్త విధములగుశిల్పకళల యందును దిట్ట. జెరూసలేమ్ పట్టణమునందు నిర్మింపబడిన యూదుల దేవాలయమునునిర్మించిన ముఖ్యశిల్పి యీతడే. ఇయ్యది ఉదాత్తమును, సర్వాంగసుందరమునగు దేవాలయమని ఆనాటి ప్రజలెల్లరిచే వేయినోళ్ళ కీర్తింపబడినది. ఈదేవాలయము బ్రహ్మాండమగు రాతితిన్నెపై నిర్మింపబడెను. ఇందు పెద్ద పాషాణము లమర్చబడెను. అందు కొన్నిరాళ్ళు సుమారు నలుబది అడుగుల పొడవుగలవి. వాని బరువు నూరు టన్నులట. ఇంతే పరిమాణముగల యితర పాషాణములు విశేషసంఖ్యయందీ భవన నిర్మాణమున నుప

యోగింపబడెను. ఈ దేవాలయపు పునాదులయందు రత్నములు మున్నగు వెలగల రాళ్ళు వాడబడినట్లు వర్ణింపబడియున్నది. మొత్తముమీద ఇట్టి అపూర్వ దేవాలయములు ప్రాచీన కాలపు చరిత్రయందు మిక్కిలి తక్కువగా కాన్పించును. ఈజిప్టుదేశపు పిరమిడ్లతో పోల్చుటకీ దేవాలయ మెల్లవిధముల తగియున్నది. ఈ దేవాలయమునకు ముందు రెండు గొప్ప స్తంభములను నిర్మించిరి. ఇచ్చటి యపూర్వ నిర్మాణములలో రాతితో సిద్ధము కావింపబడిన మిక్కిలి పెద్ద తొట్టి యొకటి. ఈ రాతితొట్టి వైశాల్యము నలుబదియేడడుగులు. ఇందు 17000 గ్యాలనుల నీరు పట్టునట. పూర్వకాలపు ఫినీషియా శిల్పుల కళానైపుణ్యమును ప్రకటించు గొప్ప భవనము లేవియును నేడు కానరాకున్నవి. అవన్నియు నశించి యుండవచ్చును. కావున జెరూసలేమ్ పట్టణమందు సాలమన్ రాజు యాజమాన్యమున టైరుపట్టణపు శిల్పకారులచే నిర్మింపబడిన యీ అపూర్వ దేవాలయమొక్కటియే ఫినీషియా వారి శిల్పకళా నైపుణిని చాటెడి యేకైక నిదర్శనముగా నున్నది.

హీరామ్ రాజు యూదుప్రభువైన సాలమన్‌కు కావించిన సహాయము వ్యర్థముగబోలేదు. యూదురాజు ఫినీషియావారికి బహువిధములగు వర్తకసౌకర్యములను కల్పించెను. ఎర్ర సముద్రపు తీరమున ఎజన్‌జీబర్ అను ప్రదేశము యూదుల స్వాధీనములో నుండెను. ఆ ప్రదేశమునుండి యితర ప్రాంతములతో వ్యాపారము చేయుటకై సాలమన్ రాజు ఫినీషియా

వర్తకుల కనుమతి నొసంగెను. దీనివలన ఫినీషియా వర్తకులకు ప్రాగ్దేశములతో వర్తకము చేయుట కవకాశము లభించెను. వీరు తమ ఓడల సంఖ్యను చాల అభివృద్ధి కావించుకొని హిందూమహాసముద్రమును ప్రవేశించి అరేబియా, హిందూదేశము, లంకాద్వీపము మున్నగు దేశములతో వ్యాపారము చేయసాగిరి. ఇచ్చటినుండి వీరు బంగారము, మంచిగంధపుచెక్కలు, సువాసనద్రవ్యములు, రత్నములు మొదలుగాగల వస్తువులను తమదేశమునకు గైకొనిపోయెడివారట. పూర్వకాలమున ఫణిజాతికి చెందిన విదేశీయ వర్తకులు భారతదేశముతో వ్యాపారము చేయుచుండెడివారని గ్రంథ నిదర్శనములచే తెలియనగుచున్నది. ఈ ఫణిజాతివారు ఫినీషియా వర్తకులే యని యూహింపవచ్చును. యూదు రాజులు తమకు ప్రాగ్దేశములతో వర్తకము చేయుటకు సదుపాయము లొసంగినందులకు సంతసించి అందులకు ప్రతిఫలముగ ఫినీషియావారు యూదులకు తమతోపాటు మధ్యధరాసముద్రమునందు వ్యాపారము చేయుట కవకాశములు కల్పించిరి. ఈ వర్తకమువలన యూదు జాతీయులు చాల లాభమును గడించినట్లు తెలియుచున్నది. పాశ్చాత్య దేశములతో వ్యాపారము చేయబోయిన యూదు, ఫినీషియా నౌకలు పశ్చిమఆఫ్రికా, బ్రిటనుద్వీపము మున్నగు దూర ప్రాంతములకు పోయి వెండి, బంగారము, దంతములు, నల్ల సీసపుకట్టె, కోతులు, నెమళ్ళు మున్నగువానిని తెచ్చుచుండెడివట. మూడు సంవత్సరములకొక పర్యాయము మాత్రమే యిట్టి వర్తక నౌకలు ప్రయాణము సాగించుచుండెడివి.

సొలమన్ రాజు యొక్క బుద్ధివిశేషము జగద్విఖ్యాతి గాంచినది. ఈతనిని గూర్చిన చిత్రవిచిత్రములగు అనేక గాథలు వ్యాప్తిలో నున్నవి. ఈతడు హీరామ్ రాజునొద్దకు కొన్ని చిక్కుప్రశ్నలను పంపి వాని ప్రత్యుత్తరములను పంపవలసినదనియు, లేనియెడల హీరామ్ తన ఓటమి నంగీకరించుచు ఒక గొప్ప మొత్తము ధనమును తనకు (సొలమన్‌కు) పంపవలసినదనియు పందెమువేసెనట. మొట్టమొదట హీరామ్ రాజు ప్రశ్నలకు సమాధానముల నొసంగజాలక ధనము నే సొలమన్ రాజునొద్దకు పంపెనట. కాని మరికొంత కాలము గడచిన పిమ్మట అబ్డిమాన్ అను ఫినీషియా పండితు డొకడీ ప్రశ్నావళికి సమాధానములను కనుగొని, మరికొన్ని ప్రశ్నలను సిద్ధపరచి వానికి ప్రత్యుత్తరములను తెలుపవలసినదిగా సొలమన్‌రాజును కోరెనట. సొలమన్ రాజందులకు సమర్థుడు కాడయ్యెను. ఈ ఓటమి వలన యూదురాజు తాను మొదట హీరామ్ కడనుండి గైకొనిన ధనమునంతను తిరిగి యొసంగుటయేకాక, మరియొక గొప్పమొత్తమును కూడ హీరామ్ వద్దకు పంపవలసిన వాడయ్యెను. కాని యీ అపూర్వప్రశ్నలెట్టివో మాత్రము మనకు తెలియరాకున్నది.

హీరామ్ రాజు ముప్పదినాలుగు సంవత్సరములు రాజ్య పాలనముచేసి తన యేబదిమూడవఏట కాలధర్మము నొందెను. ఈ రాజుయొక్క సమాధి నేటి టైరు పట్టణమునకు మూడు మైళ్ళ దూరమున కానవచ్చుచున్నది. ఈ సమాధి మిక్కిలి పూర్వకాలమునాటిదని దీని యాకారమే తెల్పుచున్నది.

పెక్కువందల సంవత్సరము లెండలకెండి వానలకు తడియుట వలన నిప్పుడది బూడిదరంగుగా కాన్పించుచున్నది. మూడు అడుగుల మందముగల మూడు రాళ్ళొకదానిపై యొకటి పేర్చబడియున్నవి. ఈ పునాదిపై పండ్రెండడుగుల పొడవును, ఆరడుగుల యెత్తునుగల యొక శిలామయ పేటికయం దీ ప్రాచీన రాజన్యుని దేహము భద్రపరుపబడినది. దీనిపై మూడు అడుగుల మందముగల మరియొక రాయి మూతగా నమర్పబడినది. ఇంతటి భద్రమైన సమాధియందు నైతమీతని దేహము సురక్షితముగా నున్నదో లేదో తెలుప వలనుపడదు.

-: మత ప్రచారము :-

హీరామ్ రాజు చనిపోయిన తరువాత ఏబది సంవత్సరముల వరకును ఫినీషియా చరిత్రయందు ప్రత్యేకముగా పేర్కొనదగిన విశేషాంశము లేవియును లేవు. ఈ యేబది సంవత్సరములలో పలువురు రాజులు రాజ్యము చేసిరి. వీరి పేరులు మనకు తెలియవచ్చుచున్నవి. ఏబది సంవత్సరములు గడచిన తరువాత ఎథ్‌బాల్ అను రాజు టైరు పట్టణమునకు ప్రభువయ్యెను. ఎథ్‌బాల్ రాజు తన కుమార్తెయగు జెజెబెల్ అను నామెను ఇశ్రాయిల్ రాజ్యమునకు ప్రభువైన అహాబ్ అనునాతనికిచ్చి వివాహము చేసెను. ఈ అహాబ్ అనువాడు సెమేరియా రాజ్యమును స్థాపించిన ఉమ్రీ అను యూదు ప్రభువు కుమారుడు. ఉమ్రీయును, అహాబ్‌నుకూడ మిక్కిలి సమర్థులైన రాజులు. ఇట్టివారితో స్నేహముచేయుట

తనకు శ్రేయస్కరమని ఎథ్‌బాల్ రాజు తలంచి యుండ వచ్చును. తైరుపట్టణపు రాజు రాజకీయాధికారములను వహించుటయే గాక ఎష్టోరెత్ అను దైవమునకు పురోహితుడుగా కూడ నుండుట యాచారము. ఎథ్‌బాల్ రాజు స్వయముగా మతాభినివేశము కలవాడగుటచే, తన కుమార్తెయందు మత ధర్మముల యెడ గాఢమగు నభిమానమును కలిగించి, ఆమె సహాయమున యూదులలో తన మతమును ప్రచారము కావించుటకై యీ వివాహము నేర్పాటు చేసియుండ వచ్చును. జెజిబిల్ రాకుమార్తెతో అనేకులు పూజారులు ఇశ్రాయిలు రాజ్యమునకు పోయిరి. ఈమె సౌకర్యార్థమై సెమేరియా కొండపై బాల్ దేవునికొరకొక దేవాలయమును యూదురాజగు అహాబ్ నిర్మించెను. బాల్ దేవుని పూజ కొరకు సుమారు అయిదు వందలమంది పూజారులను, ఎష్టోరెత్ దైవము పూజకై నాలుగువందలమంది పూజారులను రాణి తన దేశమునుండి తీసికొనివచ్చెను. వీరందరును రాణి యాతిథ్యమును స్వీకరించుచు, యూదు ప్రజలయందు ఫినీషియా మతాభిప్రాయముల నభివృద్ధిపొందించుచు ప్రచారము చేయసాగిరి. జెజిబిల్ రాణి కుమార్తెయైన అథాలియా యను నామెను జుడా రాజ్యమునకు ప్రభువైన అహీంజియా అను యూదురాజునకిచ్చి వివాహము చేసిరి. ఈ విధముగా ఇశ్రాయిల్, జుడా, రాజ్యములలో ఫినీషియా రాకుమార్తెలు రాణులైరి. వీరిరువురి ప్రయత్న ప్రోత్సాహముల వలన ఫినీషియావారి మతవిశ్వాసములు యూదు ప్రజలలో వ్యాప్తి చెందెను. దీనివలన యూదుజాతివారి మతాభిప్రాయములు

కలుషితములై, వారియందు మూఢ నమ్మకములును, దుష్టము లగు నాచారములును ప్రబలి, తుట్టతుదకు యూదుజాతివారి పతనమునకు కూడ దారితీసెనని పలువురు చరిత్రకారు లభి ప్రాయపడుచున్నారు.

-: మతము — ఆచారములు :-

ఫినీషియా దేశస్థులు ముఖ్యముగా ఇర్వురు దైవతము లను గొల్చుచుండెడివారు. అందు బాల్ అనునాతడు దేవుడు. ఎష్టోరెత్ అను దైవతము స్త్రీస్వరూపిణి. బాల్ దైవతమును మొట్టమొదట నిరాకారుడైన పరమేశ్వరునిగ ఫినీషియా వారు భావించి పూజించెడివారు. కాలక్రమమున నియ్యది విగ్రహారాధనగ మారెను. అప్పుడు బాల్ దైవమునకు వృషభాకార మొసంగబడెను. ఈ వృషభము సృష్టికి మూల మైన పురుషరూపముగా భావింపబడెను. ఈ దైవమే అగ్నికిని సూర్యునికిని అధిష్ఠాన దైవమని వీరు తలంపసాగిరి. ఈ దేవుడు సృష్టిని కావించుననియు, దానిని లయమొనర్చు ననియు కూడ ఫినీషియావారి మత విశ్వాసము. ఇంతవర కును వీరి మతమునందు హానికరమగు నంశములు లేవు. కాని యీ దైవమును సంతృప్తి పరచుటకై వీరు మిక్కిలి క్రూరము లగు నాచారముల నవలంబించిరి. అందు ముఖ్యముగా గర్హింపదగినది శిశువులను బలియొసంగు నాచారము. భగ వంతునిచే నొసంగబడిన శిశువులను, ఆయనను సంతృప్తిపర చుటకై సంతోషపూర్వకముగా సమర్పింపవలెనని వీరి మూఢ విశ్వాసము. దేవతా విగ్రహముల లోపలి భాగము న

ములలు రగుల్కొల్పి విగ్రహము ఎఱ్ఱగా కాలినవెనుక, దాని చేతులలోనికి చంటిబిడ్డలను త్రోసి తల్లులు కంటనీడి యైన పెట్టకుండ చూచుచు నిల్చుండెడివారు. దీనివలన పుణ్యము లభించునని వీరి నమ్మకము. ఎష్టోరెత్ అను దైవము ప్రకృతికిని, చంద్రునికి అధిష్టానదైవము. ఈమె ప్రకృతికి జనయిత్రి. స్త్రీలకు సంతానభాగ్యము నొసంగును. బాల్, ఎష్టోరెత్ లిరువురిని కలిపి ఫినీషియావారు పూజించెడివారు. ఎఫీశా అను ప్రదేశమున వీరి గౌరవార్థమై యొక గొప్ప దేవాలయము నిర్మింపబడెను. ఇందలి ధన కనక వస్తు వాహనము లసంఖ్యాకములు. ఇచ్చటకూడ జంతుబలులు, నర బలులును విరివిగా సాగుచుండెడివి. శిశువులనేకు లిచ్చట దైవప్రీతిగ బలియగుచుండిరి. ఒకానొక యుత్సవ సందర్భమున నిచ్చట సమావేశమైన పురుషులు తమ్ముతాము గాయపరచుకొని, రక్తము కాలువలుకట్టుచుండ, వీధులవెంట వీరావేశముతో పరుగెత్తుచుండెడివారు. ఈ పురుషులు పవిత్రులు కావున స్త్రీ వీరితో వ్యభిచరించినను తప్పులేదు. ఇట్టి మూఢాచారములను ఫినీషియా మతము యూదులలో అభివృద్ధి కావించెను. ఈ యనర్థములకెల్ల ఎథ్ బాల్ రాజును, ఆతని కుమార్తెయు, మనుమరాలును బాధ్యులని చెప్పవచ్చును. ఫినీషియా వారి మతాభిప్రాయముల ప్రభావము వారు మధ్యధరాసముద్రము నందలి ద్వీపములలో నెలకొల్పిన ప్రదేశములలో సైతము కొంతవరకు గాంచనగును. ఎథ్ బాల్ రాజు మనుమడు మాటన్ అనువాడు రాజయ్యెను. ఈ మాటన్ రాజునకు ఎలిస్సా అను కొమార్తె

యుండెను. ఈ ఎలిస్సా రాకుమారియే ఫినీషియనుల వలన ప్రదేశమగు కార్థేజ నగర నిర్మాణమునకు కారకురాలు. ( క్రీ. పూ. 814 ).

-: అస్సీరియా తో విరోధము :-

క్రీస్తుశకమునకు పూర్వము పశ్చిమఆసియా యందు రాజ్యపాలనము గావించిన సుప్రసిద్ధ ప్రభుత్వములలో అస్సీరియా సామ్రాజ్యము ముఖ్యముగా పేర్కొనదగినది. ఈ అస్సీరియా రాజ్యమువారు సామ్రాజ్యకాంక్షచే బలవత్తరమయిన సైన్యములను సిద్ధపరచుకొని ఆసియాఖండము నందలి పశ్చిమ ప్రాంతమునంతను జయించి తమ సామ్రాజ్యమందు చేర్చుకొనిరి. కాని క్రీ. పూ. తొమ్మిదవ శతాబ్దము వరకును వీరు ఫినీషియా రాజ్యముపై దండెత్తలేదు. ఫినీషియా రాష్ట్రమును ప్రవేశించుటకు పూర్వము ఉన్నతమైన లెబనాన్ కొండలను దాటవలయును. కావున నీ కష్టసాధ్యమయిన యుద్యమమున కెవ్వరును పూనుకొనలేదు. కాని క్రీ. పూ. 880-870 నడుమ అషుర్ నసిర్ పాల్ అను అస్సీరియారాజా పశ్చిమఆసియా నంతను జయించి సిరియాదేశము నాక్రమించి, ఆమీద ఫినీషియా రాజ్యము పై దండెత్తెను. ఈ రాజు గొప్ప వీరుడు. రణకుశలుడు. ఈతనికడ క్రమశిక్షణ పొందిన గొప్ప సైన్యముండెను. బలవంతుడైన అస్సీరియా రాజుతో వైరము పాటించి యుద్ధము చేయుట తమకు శ్రేయస్కరముకాదని నిశ్చయించి ఫినీషియా యందలి వివిధ పట్టణములవారు అషుర్ నసిర్ పాలుతో సంధి చేసికొనుటకై

నిశ్చయించిరి. టైరు, సిడన్, బైబ్లిస్, అర్వాడ్ మున్నగు పట్టణములవా రస్సీరియా రాజును తమకు సార్వభౌమునిగా నంగీకరించి ప్రతి సంవత్సరమును కప్పము కట్టుట కంగీకరించిరి. సుమారు ఏబది సంవత్సరముల వరకును ఫినీషియా రాష్ట్రము వారెవ్వరును అస్సీరియా రాజులపై తిరుగుబాటు చేసినట్లు కాన్పింపదు. అస్సీరియా ప్రభువులు పశ్చిమ ఆసియాయందు దేల్లెడల శాంతిభద్రతలను నెలకొల్పినందు వలన ఫినీషియావారి వ్యాపారమున కియ్యది మిక్కిలి అనుకూలముగా నుండెను. టైరు మున్నగు పట్టణముల ధన సంపద యీ కాలములో చాల వృద్ధిచెందినట్లు నిదర్శనములు కలవు. కాని ఫినీషియా, అస్సీరియా రాజ్యములనడుమ నెలకొని యున్న స్నేహసంబంధములు కొంతకాలమునకు తెగిపోయెను. ఇందుల కస్సీరియావారి సామ్రాజ్యకాంక్షయే కారణము. ప్రథమదశ యందస్సీరియా ప్రభుత్వమువారు తాము జయించిన రాజ్యముల నుండి కప్పము గైకొనుటతో సంతసించి, అచ్చటి రాజులను పదభ్రష్టులను చేయక, వారిని తమ తమ యాచారముల ప్రకారము రాజ్యపాలనము చేసికొనుట కనుమతి యొసంగుచుండిరి. కాని కొంతకాలము గడచిన వెనుక వీరు తమకు సామంతులైన రాజును పదవినుండి తొలగించి వారి స్థానమున అస్సీరియా ఉద్యోగులను రాజప్రతినిధులుగా నియమింపజొచ్చిరి. అస్సీరియా ప్రభుత్వమువారి రాజ్యపాలనములోని యీ మార్పును గమనించి, ఫినీషియావారు తిరుగుబాటు చేసిరి. ఈ కాలమునందు టైరు పట్టణమును

లూవియా అను రాజు పాలించుచుండెను. ఈతడు సిడన్, ఆర్వాడ్, బైబ్లస్, అక్కో మున్నగు పట్టణములవారిని కూడ ప్రోత్సహించి తన వైపునకు మరల్చుకొనెను. సైప్రస్ ద్వీపమువారు కూడ ఈ తిరుగుబాటులో టైరు పట్టణము వారి పక్షము నవలంబించిరి. అస్సీరియా రాజైన నాల్గవ షాల్మెనాసిర్ అనునాతడు క్రీ. పూ. 725 ప్రాంతమున గొప్ప సైన్యముతో ఫినీషియా రాజ్యముపై దండెత్తి ఆ దేశమునంతను జయించెను. కాని నౌకా సైన్యము లేనందు వలన నాతడు సముద్రమధ్యమందున్న నూతన టైరుపట్టణమును మాత్రము జయింపజాలక విఫలమనోరథుడై స్వదేశమునకు మరలిపోయెను. ఈయుద్ధకాలములోసుమారు అయిదుసంవత్సరములపాటు టైరు పట్టణమువారికిపానయోగ్యమైన మంచినీరు కూడ లభ్యమగుట దుర్లభమయ్యెను. కాని వారు తమ పట్టుదలను వీడక ఉప్పునీటినే త్రాగుచు శత్రువులతో పోరాడిరి. కొంతకాలము వరకును అస్సీరియా ప్రభువులు ఫినీషియా రాజ్యముపై దండెత్తలేదు. కాని సెన్నాచెరబ్ అను రాజు రాజ్యమునకు వచ్చినదే తడవుగా బ్రహ్మాండమగు సేనను సమకూర్చుకొని ఫినీషియాపై దండెత్తెను. టైరు పట్టణమునకు రాజుగానున్న లూవియా అనునాతడు భయపడి పారి పోగా, అతని స్థానమున ట్యూబాల్ అనువానిని సెన్నాచెరబ్ టైరు పట్టణపు రాజుగా నియమించెను. ఈ ట్యూబాల్ రాజు తొల్లింటికంటె ఎక్కువ కప్పమును కట్టుచుండెడివాడు. కాలము గడచినకొలదియు అస్సీరియావారి దౌర్జన్యము మితిమీరసాగినందున ఫినీషియా ప్రభువులు

దీనిని సహింపజాలక అస్సీరియాపై తిరుగుబాటు గావించిరి. ఇసార్‌హాడన్ అను అస్సీరియా రాజే తిరుగుబాటు గావించిన సీడన్‌రాజును నిర్బంధించి తుదకు వధించెను. అస్సీరియారాజులలో తుదిరాజని చెప్పదగిన అషుర్‌బనిపాల్ కాలములో కూడ ఫినీషియావారికిని, అస్సీరియా ప్రభుత్వమునకును తరచు యుద్ధములు నడచెను. ఫినీషియాప్రభువు లస్సీరియాకు శత్రువైన ఈజిప్టు రాజు పక్షము నవలంబించినందున, అషుర్‌బనిపాల్ రెండు పర్యాయములు ఫినీషియాపై దండెత్తి, అచ్చటి భూభాగమునంతను జయించి, ధ్వంసముచేసి, టైరు, మున్నగు పట్టణముల రాజునుండి కప్పముల గైకొని, వారి కుమార్తెలను ఉంపుడుకత్తెలుగా తన అంతఃపురములోనికి గైకొనెను. ఈ కాలమునందు ఫినీషియావారి స్వాతంత్ర్యము నామమాత్రావశిష్టమై నిల్చియుండెను.

-: దాని ఫలితము :-

ఫినీషియా అస్సీరియా రాజ్యముల సంబంధములు మొట్టమొదల ఫినీషియా వ్యాపారాదులకు లాభము కల్గించినను, తుట్టతుదకు వారికి నష్టదాయకముగనే పరిణమించెను. అస్సీరియారాజులు ఫినీషియా నుండి ధనరూపముగా కప్పమును గైకొనుటతో సంతుష్టిపడక, బంగారము, వెండి, రాగి, ఇనుము, కర్ర, తోళ్ళు, జంతువుల కొమ్ములు, రంగులు, వస్త్రములు, మున్నగు ఎన్నియో వస్తువుల నొసంగవలసిన దని బాధింపజొచ్చిరి. అస్సీరియా రాజులకు ఫినీషియా సామంతులు నౌకా సైన్యమును సమకూర్చవలసి వచ్చెడిది.

అప్పుడప్పుడు ఫినీషియా ప్రభువు లస్సీరియా సామ్రాట్టు దర్బారునకుపోయి ఆతని ముందర వంగి నమస్కారముచేసి ఆతని పాదములను ముద్దుపెట్టుకొనుట ఒక యాచారముగ నుండెను. ఫినీషియా రాకుమార్తెలను తమ కుంపుడుకత్తెలుగా పంపవలసినదని అస్సీరియా ప్రభువులు తరచు నిర్బంధము చేయుచుండిరి. ఈ యవమానమును సహింపజాలక యేరాజైన ఎదురుతిరిగిన పక్షమున అస్సీరియా రాజు లాతనిని నిర్దయగా చంపించుచుండిరి. అస్సీరియా యాధిపత్యమున ఫినీషియా యందలి సామాన్య ప్రజల కష్టములు వర్ణింప శక్యముకాదు. తరచుగా అస్సీరియా సైన్యములు ఫినీషియాపై దండెత్తి అచ్చటి ప్రజలను హింసించి, వారి పంటలను నాశనముచేసి, వారి గృహములను తగులబెట్టి వారిని ఖైదీలుగ నిర్బంధించి పరదేశములలో బానిసలుగా నమ్ముచుండిరి. శాంతి సమయమున పన్నులు వసూలు చేయుదు మను మిషతో అస్సీరియా ఉద్యోగులు, ఫినీషియా ప్రజలను పీడించుచుండిరి. కావున ఫినీషియా చరిత్రయం దస్సీరియావారి పాలన మొక విషాదకరమైన ఘట్టమని తెలుపవలసి యున్నది.

### -: వ్యాపార రమందు కుశలత :-

ప్రపంచమందలి సుప్రసిద్ధ సామ్రాజ్యము లన్నిటివలెనే అస్సీరియా సామ్రాజ్యముకూడ క్షీణదశకు లోనయ్యెను. ఈయదనును కనిపెట్టి ఫినీషియాజాతివారు స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఈ స్వాతంత్ర్య ప్రకటనము క్రీ. పూ. 640-630

నడుము జరిగియుండునని చారిత్రికులు తలంచుచున్నారు. ఇట్లు స్వతంత్రులైన తరువాత ఫినీషియావారు వర్తకమునందు చాల అభివృద్ధి గాంచిరి. ఈకాలమునందు వీరి సంపదయును, కీర్తియును మిక్కిలి పెంపొందెను. ఫినీషియా వర్తకులు ఒంటెలపై తమసరుకులను వేసికొని చాలదూరము ప్రయాణములు చేసి బాబిలోనియా పట్టణము వరకును తమ వ్యాపారమును సాగించెడివారు. మరికొన్ని ఒంటెల గుంపులను సిద్ధపరచుకొని వీరు కొండలను, లోయలను దాటి అతికష్టముతో అర్మీనియా దేశమునందలి, వాన్, ఉరూమియా అను పట్టణములకు కూడ పోవుచుండెడివారు. ఈ దేశమునందలి గుఱ్ఱములును, కంచర గాడిదలును మిక్కిలిపేరు మోసి యుండెను. ఇయ్యవి కొండప్రదేశములలో నిశ్చయముగాను, వడిగాను పయాణము చేయఁగలవు. కావున ఫినీషియా వర్తకులు తమ వస్తువుల నచ్చట అమ్మి అర్మీనియాదేశపు గుఱ్ఱములను కొని తెచ్చుకొనుచుండెడువారు. అర్మీనియాదేశమునందు బానిసలను కూడ విక్రయించుట ఆచారముగ నుండెను. ఈ బానిస వ్యాపారమును కూడ ఫినీషియా వర్తకులు సాగించుచుండెడివారు. తాము వ్యాపారము నిమిత్తమై పోయిన దేశములలో కొందరు ప్రజలను బలాత్కారముగా నిర్బంధించి ఫినీషియా వర్తకులు వారి నితర ప్రాంతములలో బానిసలుగ నమ్ముచువచ్చిరి. టైరు పట్టణమువారే యీ కాలమున ఫినీషియా పట్టణములలో నగ్రస్థానము వహించిరి. ఫినీషియా దేశపు సేనలకు టైరు పట్టణపు రాజులే నాయకులుగా నుండిరి. టైరు పట్టణమును సంరక్షించుటకు సిడన్ మున్నగు

పట్టణము లందలి ప్రజలు నియోజితు లగుచుండిరి. ఈ కాలమునందు టైరు పట్టణము వర్తకమునం దత్యున్నతస్థితి ననుభవించుచు, వివిధ దేశములనుండి వివిధ వస్తుజాలమును దిగుమతి కావించుకొనెడిది. సౌందర్యమునకును, వైభవమునకును కూడ టైరు పట్టణము నిరుపమానమై వెలుంగుచుండెనని తెలియవచ్చుచున్నది.

-: విదేశములతో సంగ్రామము :-

అస్సీరియా ప్రభుత్వమువారి యాధిపత్యమునుండి విడిపించుకొని బయటపడిన కొంతకాలము వరకును పైన తెల్పిన విధముగా ఫినీషియావారు స్వాతంత్ర్యము ననుభవించిరి. కాని అచిరకాలములో వారి దేశము మరల విదేశీయుల యాక్రమణమునకును, దండయాత్రలకును గురికావలసి వచ్చెను. చిరకాలము నుండి అస్సీరియా, ఈజిప్టు దేశములకు వైరముండెను. అస్సీరియా రాజ్యమిప్పుడు క్షీణదశకు లోనైనందున ఈజిప్టు రాజులు తల యెత్తసాగిరి. వారు తొల్లింటి అస్సీరియా సామ్రాజ్యము నంతను జయించిరి. ఫినీషియారాజ్యమువారీ విషయమును గుర్తించి తమంతట తామే ఈజిప్టు ప్రభుత్వమునకు సామంత భావము నంగీకరించిరి. ఇందువలన వీరు ఈజిప్టు రాజులకు కప్పముమాత్రము చెల్లించుచు, తమ యాంతరంగిక పరిపాలనమున కెట్టి నిర్బంధమును లేక వర్తించుచుండిరి. కాని యీ పరిస్థితులు చిరకాలము వరకు నిలువలేదు. అస్సీరియా క్షీణదశ నదనుగ తీసికొని బాబిలోనియా రాజ్యమువారు తమ యధికారమును విస్తరింప

సాగిరి. నెబోపొలేసర్ అను బాబిలోనియా రాజు క్రీ. పూ. 605 నందు అస్సీరియా సైన్యములను పూర్తిగా నోడించి, తమకు ప్రతిస్పర్ధులుగానున్న ఈజిప్టు దేశీయుల నోడించుటకై తన కుమారుడైన నెబుచడ్నెజార్ అనువానిని గొప్ప సేనతో పంపెను. ఈరాజకుమారుడు కార్ఖమిష్ అను ప్రదేశమునఁ ఈజిప్టు సైన్యములను సంపూర్ణముగ పరాభవించెను. ఈ యోటమి వలన ఈజిప్టువారి ప్రాధాన్యత తగ్గిపోయెను. స్వల్పకాలమునకు పూర్వ మీజిప్టు ప్రభుత్వమువారి యాధిపత్యము నంగీకరించిన రాజ్యము లన్నియు, బాబిలోనియావారి యధీనములోనికి వచ్చెను. సిరియా, పాలస్తీనము మున్నగు రాజ్యములతో పాటు ఫినీషియా రాజ్యమువారు కూడ బాబిలోనియా రాజకుమారునికి సామంతులైరి. అయినను వీరి రాజ్యాంగము లందు బాబిలోనియా వారేవిధముగను జోక్యము కలిగించు కొనలేదు. ఈవిధమున తమ స్వాతంత్ర్యము కొంతవరకు నశించినందుల కంగీకరింపక ఫినీషియాజాతివారు బాబిలోనియా ప్రభుత్వమును ధిక్కరించుటకై యుద్ధప్రయత్నముల సాగిరి. వీరికి ఈజిప్టు రాజు మరింత ప్రోత్సాహముల నొసంగెను. బాబిలోనియారాజుచే పరాభవింపబడిన కారణమున నీతడు తన శత్రువునకెట్లయిన ప్రతీకారము చేయవలెనని తొందరపడుచుండెను. క్రీ. పూ. 599 సంవత్సరమున టైరు పట్టణమువారు బాబిలోనియా రాజుపై తిరుగుబాటు చేసిరి. ఫినీషియా యందలి యితర పట్టణములుకూడ వీరినే యనుసరించెను. నెబుచడ్నెజారు అనునాతఁ డిప్పుడు బాబిలోనియా దేశమును పాలించుచుండెను. ఈతడు బ్రహ్మాండమగు సైన్యముతో ఫినీషియాపై

దాడి వెడలి సిడన్ మున్నగు పట్టణములను జయించి వానిని సంపూర్ణముగ నాశనము చేసెను. ప్రజలెల్లరును యుద్ధమున మడిసిరి. కొందరు పడవలలో నితర ప్రాంతములకు పారి పోయిరి. ఆపైన నీబాబిలోనియా రాజు పాతటైరు పట్టణము నాక్రమించెను. కాని నూతన టైరుపట్టణమువారు మాత్రము సముద్ర మధ్యమునుండి పదమూడు సంవత్సరము లీ రాజుతో పోరాడి తుట్టతుద కోటమి నంగీకరించిరి. ( క్రీ. పూ. 585 ) ఈ పరాజయము వలన టైరు పట్టణమువారి ప్రతిష్ఠకును వారి వ్యాపారమునకును తీరని నష్టము సంభవించెను. యుద్ధానంతరము కూడ పాత టైరు పట్టణమును పునర్నిర్మాణము కావించుటకు నెబుచడ్నెజారురా జనుమతి నొసంగలేదు. కావున నీపట్టణ మింతటితో నాశన దేవత పాలయ్యెను. ఈనాటి నుండి కొంతకాలము వరకును ఫినీషియా పట్టణము లలో నగ్రస్థానము సిడన్ పట్టణము వారికి లభించెను.

ఈజిప్టు దేశమునకును, బాబిలోనియా దేశమునకును యుద్ధములు సాగుచుండిన కాలములో ఫినీషియా జాతివారు వ్యాపారస్థులకు సహజమైన దూరదృష్టితో నేపక్షమువానిని కూడనొప్పింపక, ఇరువురతోడను స్నేహ భావములో మెలగిరి. ఈజిప్టు దేశపు రాజగు నీకో అనునాతని కి ఫినీషియా వారొక గొప్ప సేవ కావించిరి. ఈ రాజు మధ్యధరా సముద్రమును, ఎఱ్ఱసముద్రమును కలుపుచు నొక కాలువను నిర్మింప వలెనని అభిప్రాయ పడెను. కాని ఈ కాలువను త్రవ్వుట సాధ్యపడనందున సముద్రమార్గమున నెఱ్ఱ సముద్రము నుండి

మధ్యధరా సముద్రము చేరుటకు వేరొక మార్గమును కను గొనవలెనని నిశ్చయించెను. ఈ ఘనకార్యమును సాధించు టకై ఆతడు ఫినీషియావారి సహాయమును కోరెను. ఫినీ షియా నావికు లిందుల కంగీకరించిరి. ఎఱ్ఱ సముద్రపు తీరము నందలి యొక పట్టణమునుండి ఓడలు చేరి జెబిల్ మాండబ్ జలసంధిని దాటి హిందూమహాసముద్రమును ప్రవే శించి, సముద్రతీరముననే ప్రయాణము చేయుచు సోమాలీ దేశము, జాంజిబారు, మొజాంబిక్, జులూదేశము మున్నగువానిని దాటి వారు గుడ్‌హోపు అగ్రమును చేరిరి. అచ్చట కొంతకాలము వరకును శ్రమ తీర్చుకొని వారు మరల ఉత్తర దిక్కుగా ప్రయాణముచేసి తుదకు జిబ్రాల్టరు జలసంధిగుండా మధ్యధరాసముద్రమును ప్రవేశించి ఈజిప్టు దేశమునుచేరిరి. ఈప్రయాణము మూడుసంవత్సరములకాలము పట్టెనని వర్ణింపబడియున్నది. సామాన్య పరిస్థితులలో నీప్ర యాణమునకు మూడుసంవత్సరముల కాలము అనావశ్యకము. కాని ఫినీషియా నావికులు నెమ్మదిగ ప్రయాణముచేయుచు, వాతావరణస్థితి అననుకూలముగా కాన్పించి నపుడెల్ల ఆయా ప్రదేశములలో నాగుచు ముందునకు సాగిపోయిరి. అది యునుగాక ఈ నావికులు తమ కావశ్యకములగు ఆహార పదార్థములు తీసుకొనిపోలేదు. ఆ కారణముచే వారాఫ్రికా ఖండపు తీరమున కొన్ని నెలలపాటు విడిదిచేసి, భూమిని సేద్య ముకావించి తమకు కావలసిన ధాన్యాదులను పండించుకొనుచు ముందు నకుసాగిపోయిరి. కనుక ఆఫ్రికాఖండమునకు ప్రదక్షి

ణము చేయుటకు వారికి మూడు సంవత్సరముల కాలము పట్టుట ఆశ్చర్యకరమైన యంశము కాదు. ఈ దీర్ఘప్రయాణము చేసి వచ్చిన నావికులనేకాద్భుత విషయములను స్వదేశీయులకు తెల్పియుండురు. గుడ్‌హోపు అగ్రప్రాంతము లందున్నప్పుడు తమకు సూర్యుడెల్లప్పుడు నుత్తరదిశయందే యుండెననియు, తమ నీడలు దక్షిణమునకే పడుచుండెడివనియు వారు తెలిపి నప్పుడు శ్రోత లీ విషయము నాశ్చర్యముతో విని, అట్లెన్న డును సంభవింప దని తమ యవిశ్వాసమును ప్రకటించిరట. కాని మకరరేఖను దాటి దక్షిణమునకు పోయినయెడల యిట్టి మార్పులు కాన్పించు నని నేడెల్లరు నెరింగియున్నారు. కాని యీ కథాకాలము నాటికి భూగోళముయొక్క నిజ స్థితిని గూర్చి జనులకు తెలియనందున వారిట్టి సామాన్య విష యమును కూడ విశ్వసింపజాలరైరి. ఫినీషియా నావికులు నిర్వర్తించిన మహాఘనకార్యమును గూర్చి వేరుగ ప్రశం సింప నవసరము లేదు. భూగోళ శాస్త్రజ్ఞానము శూన్యమైన యాకాలములో తమ సామాన్య నౌకలలో వారు హిందూ మహాసముద్రము నందును, అట్లాంటిక్ మహాసముద్రము నందును ప్రయాణము చేయగల్గుట వారి సాహసమునకును, నౌకా నిర్వహణమునందు వారికి గల అసాధారణ సామ ర్థ్యమునకును తార్కాణము.

నెబుచడ్నెజారు రాజుచే నోడింపబడిన తరువాత టైరుపట్ట ణపు వ్యాపారమును, ప్రతిష్ఠయును క్షీణించుటయే గాక అచ్చటి ప్రభుత్వమునందు కూడ కొంత మార్పు కల్గెను. ఇంత వరకును టైరు పట్టణమును రాజులు పాలించుచుండిరి. ఈ యోటమి

సంభవించిన తరువాత టైరు పౌరులు రాజరికమును మార్చి, ప్రజానాయకులచే రాజ్య పరిపాలనము సాగించు నేర్పాట్లను కావించుకొనిరి. ఈ ప్రజానాయకులు రెండు మూడు సంవత్సరములపాటు రాజ్యపాలనము కావించిన వెనుక ప్రజలు వారిని మార్చి ఇతరులను వారి స్థానమున నెన్నుకొను చుండిరి. ఈ విధముగ కొంతకాలము గడచినవెనుక నీ పట్టణ వాసులు మరల రాజులనే తమ పరిపాలనమునకై నియమించుకొనిరి. నెబుచడ్నెజారు టైరు పట్టణపు రాజవంశీకులను కొందరను బందీలుగ కావించి బాబిలోను నగరమునకు గొనిపోయెను. అట్టి రాజవంశీకులలో నొకనిని తమ పట్టణములో రాజుగ నుండుటకై పంపవలసినదని టైరు పౌరులు బాబిలోనియా ప్రభువును ప్రార్థించిరి. ఆతడీ ప్రార్థనము నంగీకరించెను. ఈవిధముగ టైరునగరములో మరలరాజులే ప్రభుత్వము చేయసాగిరి. ఇట్టిరాజులలో మెర్బాల్ అనువాడు ప్రథముడు. హీరామ్ అనువాతడు ద్వితీయుడు. ఈ రెండవరాజు ఇరువది సంవత్సరములు (క్రీ. పూ. 552-532) రాజ్యము చేసెను. బాబిలోనియా రాజుల పరిపాలనమందు ఫినీషియా ప్రజలకు విశేషము బాధలు కలుగలేదని తోచుచున్నది. ఏలనన బాబిలోనియా ప్రభుత్వము క్షీణించి, తుట్టతుదకు పారసీక జాతివారిచే నోడింపబడు వరకును కూడ వారు బాబిలోనియా ప్రభుత్వమునకు వశంవదులై వారికి సర్వవిధముల సహాయము చేయుచునే యుండిరి. నెబోనిడస్ అను బాబిలోనియా రాజు ప్రకటనల వలన నీయంశము వ్యక్తమగుచున్నది. ఈ రాజు కాలమందే సైరస్ అను పారసీక

ప్రభువు బాబిలోనియాపై దండెత్తెను. బాబిలోనియా ప్రభుత్వము క్షీణించుచున్న దని తెలిసికొని, ఫినీషియా ప్రజలు తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరి.

### -: పారసీకులతో సంబంధము :-

క్రీ. పూ. 538 ప్రాంతమున పారసీక రాజగు సైరస్ అనునాతడు బాబిలోను నగరము నాక్రమించి బాబిలోనియా సామ్రాజ్యము నంతమొందించెను. బాబిలోను సామ్రాజ్యము నకు తాను వారసుడ నని యీ రాజు తలంచినట్లు తోచు చున్నది. బాబిలోను రాజులచే పాలింపబడిన దేశములన్నియు తనకు లోబడినవని నిశ్చయించి యీతడు ఫినీషియావారిని కూడ తన సామంతులలో లెక్కించుకొనెను. ఈ యుద్దేశ్యము తోనే యీతడు యూదు ప్రజలకు లెబనాన్ కొండలలో పెరిగెడి కర్రను తీసికొను డని సెలవిచ్చెను. ఈ యాజ్ఞ తమ స్వాతంత్ర్యమునకు భంగము కలిగించినను ఫినీషియా వారిందులకు బహిరంగముగా నెట్టి అభ్యంతరమును చెప్పలేదు. యూదులు కూడ న్యాయసమ్మతముగనే వర్తించి తాము తీసికొనిన కర్రకు బదులుగా గోధుమలు, సారాయములు, నూనె మున్నగు వానిని ఫినీషియావారి కిచ్చుచుండిరి. ఈ విధ ముగ సైరస్ రాజు కాలములో ఫినీషియావారి కెట్టి కష్టము లును, నష్టములును కలుగలేదు. ఈతని యనంతరము రాజ్య మునకు వచ్చిన కాంబిసస్ అను రాజు ఫినీషియావారి సహా యము కోరవలసిన వాడయ్యెను. సైప్రస్ ద్వీపముపై ఈజిప్టు రాజు దండెత్తి దానిని వశపరచుకొనెను. ఈ సైప్రసు

ద్వీపము తమ సామ్రాజ్యములో చేరినదని పారసీక ప్రభువులు తలంచు చుండిరి. తన సామ్రాజ్యములో నొక భాగమును పర రాజగు ఈజిప్టు పాలకు డాక్రమించుట పారసీక రాజునకు తల వంపుగా నుండెను. కావున నాత డీజిప్టు దేశముపై దాడి వెడ లుటకు నిశ్చయించుకొనెను. కాని యితనియొద్ద తగినంత నౌకా సైన్యము లేనందున ఈ దండయాత్ర సాగించుట కష్ట సాధ్య మయ్యెను. కావున సీకాంబిసస్ రాజు ఫినీషియావారిని మంచిచేసికొని వారి సంపూర్ణ సహాయమును పడసి ఈజిప్టు దేశమును జయించెను. ఈ యుద్ధము ముగిసిన తరువాత పార సీక రాజు కార్థేజి నగరముపై దాడి వెడలుటకు నిశ్చయించి ఫినీషియా నౌకలాపట్టణముపై దాడి వెడలవలెనని యాజ్ఞా పించెను. కాని ఫినీషియావా రిందుల కంగీకరింపలేదు. కార్థేజి ప్రజలును తామును ఒకేజాతికి చెందిన వారమగుటచే, ఆ నగర ముపై యుద్ధముసేయుట తమ సోదరులను తాముహింసించుట వంటిది కావున తామాపనికి పూనుకొనజాలమని ఫినీషియా వారు దృఢముగ తెల్పివైచిరి. పారసీకరాజు చాల ఆగ్రహ పడియును వారి వాదము సమంజసమైనదని గుర్తించితన ఉద్య మమును విరమించెను. ఈ విధముగ ఫినీషియా ప్రజలొక క్లిష్ట సంధి నుండి విడివడిరి. ఫినీషియా దేశీయులను పారసీక రాజు లెవ్వరును కూడ ఎక్కువగ బాధింపలేదు. ఇందులకు ఫినీషియా దేశము వారికి గల నౌకా బలమే కార ణము. నౌకాబలము లేనియెడల తాము యుద్ధములయందు జయము సంపాదించుట దుర్లభము కావున నౌకా సైన్యమును తమకు సహాయముగ పంపగల్గు ఫినీషియావారిని సాధ్యమై

నంత వరకు సంతోషపరుప వలయునని పారసీక ప్రభువులు యత్నించిరి. కావుననే డేరియస్ తన సామ్రాజ్య ములో నొక భాగమైన ఫినీషియాను పాలించుటకై తన యుద్యోగులను పంపక అచ్చటి రాజులను తమ యిచ్ఛవచ్చిన ప్రకారము రాజ్యము చేయుట కనుమతి యొసంగెను. ఫినీషియా ప్రజలు పారసీక రాజునకు సంవత్సరమునకు నిర్ణీత మైన కప్పమును (84000 పౌండ్లు) కట్టవలెను. ఆతని ఆజ్ఞ లేకుండ వీరు పరరాజులతో స్నేహము కావించుకొనరాదు. పారసీక ప్రభువున కితరులతో యుద్ధము సంభవించినప్పుడు సైన్యమును పంపి సహాయపడవలెను. తమ యనుకూలతను వీరు గుర్తించుకొని ఫినీషియా ప్రజలు పారసీక సైన్యమునకు మూడు నూర్ల యుద్ధపు పడవలను సహాయముగా పంపెడి వారు. పారసీక రాజు మొత్తము నౌకా బలమునందు నిది నాల్గవవంతు. డేరియస్ రాజు కాలములో నాతని సామ్రా జ్యము నందలి గ్రీకు ప్రజలు తిరుగుబాటు చేసిరి. ఫినీషియా ప్రజలు తమ నౌకాబలమును డేరియస్ రాజునకు సహాయ ముగ పంపి లాడే యుద్ధమున నీ తిరుగుబాటుదారులను ఓడిం చుటయందెంతో సహాయపడిరి. జర్‌క్సిస్ అను పారసీకరాజు క్రీ. పూ. 485 నందు గ్రీకు దేశముపై దాడి వెడలినప్పుడు కూడ ఫినీషియావా రతని సైన్యమునకు చాల సహాయ పడిరి. పడవలతో వంతెన కట్టి ఈ రాజు సైన్యముల న్నిం టిని యూరోపు ఖండమునందు కొంపుటకు సదుపాయములు చేసిరి. కాని సాలమిస్ అను ప్రదేశమున సంభవించిన నౌకా యుద్ధములో తన సేనలకు పరాజయము సంభవించి నందున

కోపగించి ఈ జర్క్సిస్ రాజు ఫినీషియా నౌకోద్యోగులను పలువురను నిర్దయతో చంపించెను. నిజముగ నీ యుద్ధమునందు ధైర్యముతో పోరాడినవారు ఫినీషియా నావికులే. కాని కోపోద్రేకముచే జర్క్సిస్ రాజు వివేచనాశక్తి నుపయోగింపక ఫినీషియావారినే శిక్షించెను. ఈ అన్యాయకృత్యము వలన ఇరువది సంవత్సరముల వరకును ఫినీషియా ప్రజలు పారసీక రాజులకు సహాయము చేయుట మానిరి.

ఇతరులు ప్రోత్సాహము వలన ఫినీషియా ప్రజలు పారసీక సామ్రాట్టులపై అప్పుడప్పుడు తిరుగుబాటు చేసినను, మొత్తముమీద వీరు పారసీక ప్రభుత్వమునెడ విధేయతతోనే వర్తించిరని తెలుపవచ్చును. పారసీక సామ్రాజ్యములో శాంతిభద్రతలు చక్కగ నెలకొని యుండెను. వీరు నాణెముల వాడకమును తమ సామ్రాజ్యము దెల్లెడల పరిపాటి కావించిరి. ఈ మార్పువలన వ్యాపారస్థులగు ఫినీషియావారి కెంతయో లాభము కలిగెను. ఈ యుగమందు ఫినీషియా దేశము ఎక్కలి భాగ్యవంత మయ్యెను.

-: అలెగ్జాండరు వీరుడు :-

గ్రీకు దేశమునందలి మాసిడోను రాష్ట్రమునకు రాజును జగద్విఖ్యాత వీరుడునగు అలెగ్జాండరు అను నాతడు పారసీక సామ్రాజ్యమును కూలద్రోసి నట్లు చరిత్ర నెరింగినవారికి సువిదితము. అలెగ్జాండరు రాజు క్రీ.పూ. 336వ సంవత్సరమున సింహాసన మధిష్ఠించెను. మొదటినుండియును కూడ ఈతని కాసియా ఖండముపై నాడి వెడలవలయునని విస్తారముగ

ప్రయత్నములు చేయసాగెను. ఈ విషయము నెరింగి పారసీక సైన్యము నందలి నౌకాధిపతులు తక్షణమే ఏజియన్ సముద్రము నందలి గ్రీకు నౌకలనెల్ల నాశనముచేయవలసిన దనియు, దానివలన అలెగ్జాండరు రాజు ఆసియా ఖండముపై దండెత్త జాలడనియు డేరియస్ రాజునకు తెల్పిరి. కాని దూరదృష్టి లేని డేరియస్ రాజీ సలహా నంగీకరింపలేదు. అలెగ్జాండరు ఆసియా ఖండమును ప్రవేశించి యూఫ్రటీసు నదీతీరము నందలి ఇసాస్ మైదానములో పారసీక రాజు సైన్యములను సంపూర్ణముగా నోడించెను. (క్రీ.పూ. 333) డేరియస్ రాజు సిగ్గు విడచి తన రాజధానికి పారిపోయెను. పారిపోవుచున్న పారసీక సైన్యములను వెంబడించి అలెగ్జాండరు వానిని నాశనము చేయునని పలువురు తలంచిరి. కాని యాతడట్లు కావింపలేదు. పారసీక రాజుల బలము చాలవరకు వారి నౌకా సైన్యముపై ఆధారపడి యున్నదని గ్రహించి, ఆ నౌకాబలమును పూర్తిగా తాను వశపరచుకొనుటకై యాతడు నిశ్చయించెను. ఫినీషియా దేశమువారి నౌకలు ప్రసిద్ధి గాంచి యుండినందున అలెగ్జాండరు దృష్టి వీరిపై మరలెను. ఇసాస్ యుద్ధము తరువాత కొంతకాలము శ్రమ తీర్చుకొని యాతడు ఫినీషియా దేశమును ప్రవేశించెను. ఈ గ్రీకు వీరుని ప్రతాపమును గూర్చి వినియుండుట వలనను, పారసీక ప్రభుత్వము యొక్క దౌర్బల్యమును, నిస్సహాయతను గుర్తించియు ఫినీషియా యందలి వివిధ పట్టణములవారు అలెగ్జాండరు వీరునికి స్వాగతమొసంగి యాతనికి వశ్యులై మెలంగుట కంగీకరించిరి. మరాథస్, అరాడస్, బిబ్లస్, సిడన్ నగరముల రాజు లెట్టి

యుద్ధము ను లేకుండగనే అలెగ్జాండరునకు సామంతులైరి. తుట్టతుద కలెగ్జాండరు టైరు పట్టణమును సమీపించెను. ఆ పట్టణమువారు కూడ తమ పౌరశ్రేష్ఠులను గ్రీకు వీరునికి స్వాగత మొసంగుటకై పంపి ఆతనికి విలువగల కానుకలను సమర్పించిరి. పారసీక రాజునకు తాము విధేయులమై యున్నట్లే ఈతని సార్వభౌమత్వమును గూడ అంగీకరించెద మని టైరు పౌరులు విన్నవించిరి. అలెగ్జాండరు వీరి కానుకల నంగీకరించి వారు పంపిన సందేశమునకు సంతృప్తిని ప్రకటించెను. వారు పంపిన సందేశమునకు ప్రత్యుత్తర మొసంగుచు, తాను త్వరలో సముద్రమధ్యమందలి నూతన టైరు పట్టణమును సందర్శించి, అందలి మెల్కార్త్ దేవుని ఆలయమునందు పూజాదికములు నిర్వర్తించెదనని, అలెగ్జాండరు వర్తమాన మంపెను. గ్రీకు రాజులు తాము హెర్క్యులిస్ అను పురాణపురుషుని వంశమువార మని తలంచుచుండిరి. టైరు పట్టణమందలి మెల్కార్త్ దేవుడు హెర్క్యులిస్ యొక్క రూపాంతరమే కావున తమకాతడు పూజ్యుడని గ్రీకులు తలంచు చుండిరి. కాని అలెగ్జాండరును తమ నగరములోనికి రానిచ్చుటకు టైరు నాగరకు లంగీకరింపలేదు. ఒక పర్యాయము ఆతనిని తమ ద్వీపములోనికి వచ్చుట కనుమతించిన పక్షమున తమ స్వాతంత్ర్యము సంపూర్ణముగ నశించు నని వారు భయపడిరి. తన కోర్కెను మన్నించుటకు నిరాకరించినందున అలెగ్జాండరు రాజున కమితమైన యాగ్రహము కల్గెను. తనకు వారు సంపూర్ణముగ వశ్యులు కానియెడల టైరు పట్టణ

మును నాశనము చేసెదనని అలెగ్జాండరు బెదిరించెను. అయి
నను టైరు నగరము ఆతనికి వశపడలేదు. టైరు ద్వీపమునకును
సముద్రతీరమునకును అరమైలు వెడల్పుగల నీటిపాయ గలదు.
ఈ శాఖకు వారధికట్టి తన సైన్యములను టైరు పట్టణపు
గోడలవద్దకు నడపి పట్టణమును వశపరచుకొనుటకై అలె
గ్జాండరు నిశ్చయించెను. ఇట్టి అపూర్వ ప్రయత్నము
చేయుట మహాధీమంతుడును, జగదేకవీరుడునగు అలెగ్జాండరు
నకు మాత్రమే చెల్లినది. కాని టైరు పట్టణమువారు గ్రీకు
సైన్యముల నీ వారధి నిర్మింపకుండ ముప్పుతిప్పలు పెట్టిరి.
ఈవిధముగ ఆరేడు మాసములు ఘోరముగ యుద్ధము నడ
చెను. ఈ యుద్ధమందు టైరు పట్టణమువారి సేనలు చూపిన
ధైర్యసాహసములును, సమయస్ఫూర్తియు, యుద్ధకౌశల్య
మును దేవతలుకూడ హర్షింప దగినవి. సముద్రమధ్యమందున్న
టైరు పట్టణమును నౌకాబలము లేకుండ జయించుట దుర్లభ
మని గ్రహించి అలెగ్జాండరు తనకీవరకు లోబడిన ఫినీషియా
పట్టణముల నుండియు, సైప్రసు ద్వీపమునుండియు గొప్ప
నౌకాబలమును సంపాదించి టైరు పట్టణమును ముట్టడించెను.
అలెగ్జాండరు తెచ్చిన నౌకలపారముగ నున్నందున టైరు
నావికులు వీని నెదిరింపజాలకైరి. ఈ సమయములో వారధికూడ
పూర్తియయ్యెను. గ్రీకు సేనలు సరాసరి టైరు పట్టణము
వరకు నడచి కోటగోడలను నాశనము చేసెను. స్వయముగ
అలెగ్జాండరు కూడ ఈ యుద్ధమున పాల్గొనెను. తుట్టతుదకు
శత్రుసంఖ్య అపారమైనందున టైరునగరము వారోడిపోయిరి.
(క్రీ. పూ. 332) తన్నెదిరించి యుద్ధము చేసినందులకు కోపించి

అలెగ్జాండరు టైరు పట్టణమును నాశనముచేసి పురజనులనేకులను చంపించెను. కొంతకాలము వరకును టైరు పట్టణము జీర్ణస్థితి యందుండియు, చేవగల్గిన చెట్టు మోడుగా కొంత కాలముండియు మరల చిగిర్చినట్లుగా మరల నూతన భవనముల తోడను, సుందర రాజమార్గముల తోడను, ధనధాన్య సంపదల తోడను తలయెత్తెను.

అలెగ్జాండర్ మరణానంతర మాతని సామ్రాజ్యమును గ్రీకు సేనానాయకులు పంచుకొని స్వతంత్రులుగా పాలింప దొడగిరి. సిరియా రాష్ట్రమును సెల్యూకస్ వంశమువారును, ఈజిప్టు రాజ్యమును టాలమీ లనువారును వశపరచుకొనిరి. ఈ రెండురాజ్యములకును తరచుగా యుద్ధములు సంభవించుచుండెను. ఫినీషియా రాష్ట్రమునందే ఈ యుద్ధములు సాగుచుండెడివి. ఇందు జయముపొందిన రాజు ఫినీషియా రాష్ట్రమును తన రాజ్యములో చేర్చుకొనుచుండెను. ఈ విధముగ టైరు, సిడన్ పట్టణములు ఈజిప్టు రాజులకు కొంతకాలమును, సిరియా ప్రభువులకు మరికొంత కాలమును వశపడియుండెను. కాని క్రీ. పూ. 198 నాటికి సిరియారాష్ట్రము బలవత్తర మైనందున ఫినీషియా ప్రజ లీ రాజ్యమునకు సామంతులుగ నుండజొచ్చిరి. సిరియా రాజులు ఫినీషియా రాష్ట్రమున కనేక విషయములలో స్వాతంత్ర్యము నిచ్చి మన్నించిరి. కాని ఫినీషియారాష్ట్రీయులలో నీకాలమందు గొప్పమార్పులు పొడకాన్పించుచున్నవి. గ్రీకు దేశస్థు లీ ప్రాంతములలో విశేష సంఖ్యయందు నివాస మేర్పరచుకొనిన కారణమున ఫినీషియా ప్రజలు క్రమక్రమముగా గ్రీకుల యాచార వ్యవహారములను

కొ ట పా ట ల ను, తుట్టతుదకు భాషను కూడ అవలంబించిరి. ఏసుక్రీస్తు ఫినీషియా దేశమును సందర్శించినప్పు డచ్చటి ప్రజలు గ్రీకు భాషనే వాడుచున్నట్లు తెలిసెను. జగద్విఖ్యాతి గాంచిన రోమకవీరుడు జూలియస్ సీజరు కాలమందు ఫినీషియా రాష్ట్రము రోమకజాతివారికి స్వాధీనమయ్యెను. రోమక చక్రవర్తులు కూడ ఫినీషియా పట్టణములకు వారు పురాతన కాలమునుండియు అనుభవించుచుండిన హక్కులను స్వాతంత్ర్యమును నిర్నిరోధముగ నొసంగిరి. రోమక చక్రవర్తి సార్వభౌమత్వము నంగీకరించుటకు ఫినీషియావారెట్టి అభ్యంతరమును తెలుపలేదు. రోమక యుగమునందు ఫినీషియాయందు కలిగిన గొప్ప మార్పు క్రైస్తవ మతవ్యాప్తి. క్రీస్తుశకము నందలి మొదటి మూడు శతాబ్దులలో క్రైస్తవ మతము ఫినీషియా దేశమం దంతటను వ్యాపింపలేదు. ఈ దేశస్థుల పురాతన మతమును, నూతనమత మగు క్రైస్తవమతమును సమముగా దేశములో నాదరింపబడెను. కొన్ని సమయములలో ఫినీషియా ప్రభుత్వమువారు క్రైస్తవ మతస్థులను బాధించినట్లు కూడ తెలియుచున్నది. కాని క్రీ. శ. నాల్గవ శతాబ్దియందు కాన్‌స్టంటైన్ అను రాజు రోమక సామ్రాజ్యమున కధిపతి యయ్యెను. ఈతడు మతము లన్నిటిని సమభావముతో రక్షింపవలెనని నియమ మేర్పరచెను. అప్పటినుండియు క్రైస్తవమతము క్రమముగా బలపడసాగెను.

## -: వైజ్ఞానికాభివృద్ధి :-

క్రీస్తుశక ప్రారంభము నుండియు, అంతకు కొంచెము పూర్వమును కూడ ఫినీషియా దేశమునందు భాషా వైజ్ఞాని

శాభివృద్ధి చక్కగ కానవచ్చుచున్నది. ఈ యుగమునందు పలువురు గ్రంథకర్త లుద్భవించి అనేకగ్రంథములను రచించిరి. బోయిథస్, డియోడోటస్ అనువారు వీరిలో ప్రథములు. వీరిరువురును తత్త్వశాస్త్రము నందు ప్రజ్ఞ కలవారు. ఆంటీపాటర్, అపోలోనియస్ అనువారు కూడ తత్త్వశాస్త్రము నందే కృషిసల్పి తద్విషయమై గ్రంథములను రచించిరి. తైరు సిడన్ నగరముల వలెనే బైబ్లస్ నగరము కూడ ఈ కాలమున ప్రసిద్ధు లైన గ్రంథకర్తలకు జన్మభూమి అయ్యెను. ఫిలో అను నాతడును, ఈతని శిష్యుడైన హెర్మిప్పస్ అను నాతడును వీరిలో చాల విఖ్యాతిని పొందిరి. ఫిలో అను నాతడు ఫినీషియా దేశపు చరిత్రను వ్రాసెను. ఫినీషియా భాష యందు వ్రాయబడిన మూలగ్రంథమును తా ననుసరించి నట్లు ఫిలో తెలిపియున్నాడు. కాని మూలగ్రంథమునకును ఈతని పుస్తకమునకును చాల భేదము కలదు. ఫిలో శిష్యుడైన హెర్మిప్పస్ అను వాడు విమర్శకుడు గను, వైయాకరణి గను ప్రసిద్ధి చెందెను. తైర్ పట్టణపు పౌరుడైన మారినస్ అను నాతడు సక్రమ పద్ధతులపై భూగోళ శాస్త్రమును వ్రాసెను. ఫినీషియా నావికులచే కనుగొనబడిన యనేకాంశములను చదివి, ఆత డీ గ్రంథమును రచించెను. టాలమీ అ నేడి ప్రసిద్ధ రోమక భూగోళ శాస్త్రజ్ఞుడీ మారినస్ రచించిన గ్రంథమునే తానను సరించితి నని యంగీకరించి యున్నాడు. ఈ కాలము నందే తైరు పట్టణమున పాలస్ అను గొప్ప ఆలంకారికుడు నివసించి యుండెను. క్రీ. శ. మూడవ శతాబ్ది యందు తైరు పట్టణ మందు పార్ఫిరియస్

అను గొప్ప పండితు డుండెడివాడు. ఈతడు క్రైస్తవ మత మును ఖండించుచు అనేక గ్రంథములను రచించెను. ఈపుస్తకములు విద్యార్థులలో చాలవ్యాప్తిని చెంది, క్రైస్తవమత ప్రచారమునకు నిరోధము కల్గించెను. బెరిటస్ నగరము నందు క్రీస్తు శకారంభము నుండియు సుప్రసిద్ధ మగు నొక న్యాయశాస్త్ర కళాశాల యుండెడిది. విఖ్యాతులగు న్యాయ వాదుల నీ కళాశాల దేశమునకు సమర్పించెడిది. ఫినీషియా పండితులు, గ్రంథకారులు మున్నగు వారిని గురించిన యొక అంశము ముఖ్యముగా గమనింప దగియున్నది. వీరు జాతిచే ఫినీషియా వారయ్యు భాష చేతను, అభిమానము చేతను గ్రీకులు. వీరి గ్రంథములు గ్రీకు భాషయందు రచింపబడెను. మాతృభాష యగు ఫినీషియా భాషను వీరిలో పలువు రెరుంగ రనియే తెలుపవచ్చును.

ఈ కాలము నుండి ఫినీషియా దేశ చరిత్రను గూర్చిన విశేషాంశము లేవియును మనకు తెలియవచ్చుట లేదు. పురా తన కాలము నందు వీరి యందు కానవచ్చిన వైశిష్ట్యతయు, గుణసంపదయు క్రమముగ వీరి యందు లోపించి యుండ వచ్చును. అదియును గాక ఫినీషియా రాష్ట్రము విస్తృతి యందు మిక్కిలి చిన్నదని మనము తెలిసికొని యున్నాము. ఫినీషియా వారు తమ చాకచక్యము చేతను, ధైర్య సాహస ముల చేతను, అస్సీరియా, బాబిలోనియా వంటి సామ్రాజ్య ముల తోడను, అలెగ్జాండరు వంటి మహావీరుని తోడను కూడ పోరాడి తమ స్వాతంత్ర్యమును నిలుకబెట్టుకొనిరి.

కాని యీ విధముగ తరచు యుద్ధములు చేయుచుండుట వలన వీరి బలమును, ఉత్సాహమును కూడ క్షీణించి యుండ వచ్చును. దానికి తోడు రణ కుశలురున్నురాజనీతి విశారదులు నగు రోమక జాతివారు ఫినీషియా రాజ్యమును తమ సామ్రాజ్యములో చేర్చుకొనుట కుద్యుక్తులై యుండిరి. ఇట్టి సమర్థులతో పోరాడి తమ స్వాతంత్ర్యమును సంరక్షించు కొను సామర్థ్యము తమ వద్ద లేనందున ఫినీషియా దేశస్థులు క్రమముగ పరతంత్ర దశలోనికి దిగిపోయిరి. క్రైస్తవ మత వ్యాప్తి వలన కూడ వీరి వైశిష్ట్యత నశించి యుండవచ్చును. గ్రీకు నాగరకతతో సంపర్కము కలుగుట వలన ఫినీషియా యందు వైజ్ఞానికాభివృద్ధి కలిగిన మాట వాస్తవమే. కాని దాని వలన ఫినీషియా జాతి వ్యక్తిత్వము నశించెను. ప్రజలు స్వభాషను మరచి గ్రీకు భాషనే నిత్య జీవిత మందు వాడ జొచ్చిరి. ఇయ్యది జాతీయతకు గొడ్డలిపెట్టు వంటిదని వేరుగ తెలుప నక్కరలేదు. ఇట్టి అనేక కారణముల వలన రోమక మహాయుగ మందు ఫినీషియా జాతి క్షీణ దశకు లోనై ప్రపంచ చారిత్రక రంగము నుండి తొలగుచున్న దని నిశ్చ యముగ తెలుప వచ్చును.

### -: ఫినీషియా సభ్యత :-

ఫినీషియా సభ్యతను గూర్చిన మరికొన్ని యంశము లను స్మరించి యింతటితో నీ కథాభాగమునకు స్వస్తి వాక్యము చెప్ప వచ్చును. కార్యరంగమునందు దోక... జాతి వైశిష్ట్యతయు, సామర్థ్యమును, తెలుపగల్గిన యంశములలో

శిల్పకళ యొకటి. కాని పూర్వకాలము నందు ఫినీషియా దేశీయులు నిర్మించిన భవనములు మున్నగున వేవియును నేడు కానరా కున్నవి. ఫినీషియా శిల్పులు యూదు ప్రభు వైన సాలమన్ రాజు కోర్కెపై జెరుసలేమ్ నగరమున బ్రహ్మాండ మగు నొక దేవాలయమును నిర్మించి రని తెల్పి యున్నాము. ఆ దేవాలయము నేడు కానరాకున్నను దాని వర్ణన కొన్ని గ్రంథములలో కానవచ్చు చున్నది. ఫినీషియా శిల్పకళ కిదియొక గొప్ప నిదర్శనము. పూర్వకాలము నందు ఫినీషియా శిల్పులు వివిధ మందిరముల నిర్మించుటకై కర్రను విశేషముగా వాడుచుండెడివారు. దారునిర్మితములగు భవనములు చిరకాలము నిలువజాలవు కదా! ఈ కారణ ముచే ఫినీషియా శిల్ప సామర్థ్యమును చాటజాలు భవన రాజము లేవియును ప్రస్తుతము లేకుండుట సంభవించినది. కాని కోట గోడలు, ప్రసిద్ధ పురుషుల సమాధులు మున్నగు వాని యందు మాత్రము ఫినీషియావారు కూడ రాతినే వాడిరి. బహుశః వారి కిందు మార్గాంతరము కానరాకుండి యుండ వచ్చును. ఆరాడస్ అను నామముతో పురాతన యుగమందు ప్రసిద్ధి గాంచిన నగర రాజము యొక్క ప్రాకా రములు శిథిల దశయందు నేటికిని కానవచ్చు చున్నవి. ఈ ప్రాకారము పెద్ద శిలలతో నిర్మింపబడి యున్నది. ఎంత పెద్ద పాషాణముల నుపయోగించిన తమ ప్రాకారము లంత బలవత్తరముగా నుండు నని వీరి యూహ కాబోలు. పెద్దపెద్ద శిలల నేవిధముగను చెక్కి మార్పకుండ వీరు కోట గోడలలో నుపయోగించు చుండిరి. రెండు పెద్ద పాషాణముల నడుమ

సంను లేప్పడిన యెడల వానిని కప్పుటకై చిన్న రాళ్ళను వాడుచుండిరి. కావున ప్రాకార నిర్మాణము లందు బలిష్ఠతయే వీరి ముఖ్యలక్షణముగ నుండెడి దనియు. ఇతర విషయముల యెడ వీరెక్కువ శ్రద్ధ వహించ లేదనియు తెలుపవచ్చును. ఫినీషియా దేశములోని విఖ్యాత పురుషుల సమాధులు కొన్ని నేటికిని కాన్పించు చున్నవి. అరాడస్ నగరమున కెదురుగ ఫినీషియా భూభాగముపై అమ్రిత్ అను ప్రదేశమున పురాతన యుగమునాటి రెండు సమాధులు కలవు. ఇందు మొకటిది వర్తులాకారము గల తిన్నె పునాదిపై నిర్మింపబడినది. ఈ తిన్నెకు నాలుగు ప్రక్కల నాలుగు సింహములు చెక్కబడినవి. ఈ సింహములు సమాధియొక్క భారమునంతను మోయుచున్నట్లు చిత్రింపబడినవి. గుండ్రని యీ తిన్నెయు, సమాధిని మోయుచున్న సింహములును ఒకే రాతిలో చెక్కబడినవి. ఈ పునాదిపై ఇంచుమించు శివలింగము వలె చూపట్టు మరియొక నిర్మాణము కాన్పించును. ఇది పొడవు గను గుండ్రముగను ఉన్నది. దీని పైభాగమున అర్ధచంద్రాకారముగ నున్న యొక్క దిమ్మె అమర్పబడి యున్నది. లింగాకృతిలో నున్న ఈ నిర్మాణముపై దర్శనీయమగు శిల్పకళా చాతుర్యము చూపబడినది. రాతి తిన్నెయును దానిపై గల నిర్మాణమును గూడ కలిసి 32 అడుగుల యెత్తున్నవి. కాని యీ కట్టడము నిజమైన సమాధి కాదు. అది భూగర్భము నందున్నది. కట్టడమునకు కొంచెము దూరమున భూగర్భము లోనికి పోవు

టకు మెట్లు కలవు. ఈ మెట్లననుసరించి సుమారు నూరడుగుల లోనికి దిగిన యెడల నిచట పెద్ద గది కాన్పించును. దాని నుండి మరియొక శాలలోనికి పోవచ్చును. మూడవ గది యందు నిజమైన సమాధులు గలవు. భూగర్భము నందు గల మూడు గదులును కూడ ఒక రాతిని దొలిచి సిద్ధపరుప బడినవి. ఈ ప్రదేశమున మరియొక నిర్మాణము కూడ గలదు. కాని యిది మొదటి కట్టడము వలె సుందరముగ లేదు. ఈ ఫినీషియా జాతివారు చనిపోయిన వారి సమాధుల విషయమై మిక్కిలి శ్రద్ధ వహించెడివారు. వీని కొరకై దుర్గమ మగు శిలలను భేదించి వానియందు మృతుల కొరకై ఇతరుల కెవ్వరికిని కానరాకుండ సమాధులు నిర్మించుచుండిరి. మృత దేహములను రాతి పెట్టెలలో భద్రపరచుట వారి కాచారముగ నుండెను. ఈ రాతి పెట్టెలపై గల మూతలపై మరణించినవారి యాకారమును చెక్కుట కూడ వారికి పరిపాటిగ నుండెను. ఇట్టి సమాధులపై కొన్ని పంక్తులను రాతి యందే చెక్కుచుండెడివారు. సిడన్ రాజగు ఇస్మునాజర్ అను రాజు సమాధిని చారిత్రిక పరిశోధకులు కనుగొని యున్నారు. "నేను శాశ్వతముగ నిద్రించుచున్నాను. నా యొక్క సమాధి కడకు వచ్చి నా శాంతి కెవ్వరును భంగము కల్గింపరాదు. అట్లు కావించిన వారికి సమస్తములగు అశుభములును కల్గును" అని యీరాజు తన సమాధిపై వ్రాయించు కొనెను.

-: పరిశ్రమలు :-

ఫినీషియా జాతివారికి పేరు ప్రఖ్యాతులు కలుగుట కొక ముఖ్య కారణము వారి పరిశ్రమలు. ఈ పరిశ్రమలలో ముఖ్యముగా పేర్కొనదగినవి, బట్టలకు రంగులు వేయుట, గాజు సామానులు తయారు చేయుట వస్త్రముల నేత, లోహములపై చెక్కడపు పని మొదలగునవి. మధ్యధరా సముద్రము నందలి తూర్పు భాగమున, అందును సిరియా రాష్ట్రపు తీరమున నొక ప్రత్యేక మగు నత్తగుల్లలు లభించును. ఈ నత్తగుల్లల నుండి ముదురైన ఎఱుపు రంగును సిద్ధపరిచి దీనితో బట్టలకు రంగు వేయుదురు. అట్టి వస్త్రములు చూచుట కెంతయో ఆకర్షకముగ నుండుట వలన పూర్వకాలమునందితర దేశీయు లెల్లగును ఇట్టి వస్త్రములకై మిక్కిలి మనసు పడుచుండెడివారు. ఈ రంగులను సిద్ధపరచు పద్ధతి ఫినీషియావారి కొక్కరికి మాత్రమే తెలిసి యుండెను. ఇతర దేశముల వారిట్టి చక్కని తొగిఋరంగును తయారు చేయుటకై యెంత యత్నించినను వారికి నేర్పలవడ లేదు. ఫినీషియా వర్తకు లవశ్యకమునకు తీసికొని పోవు సరకులలో నిట్టి రంగుబట్టలు ముఖ్యస్థానము నలంకరించు చుండెడివి. ఫినీషియావారు మనోహరమైన గాజు సామానులు కూడ చేయుటయందు నేర్పు వహించి యుండిరి. కాచ నిర్మాణమున కావశ్యకమైన ప్రత్యేక మగు ఇసుక ఫినీషియా దేశములో లభించెడిది. ఇందు చేర్చవలసిన (Alkali) క్షారము ఈజిప్టు దేశము నుండియు తదితర ప్రాంతముల నుండియు ఫినీషియా పారిశ్రామికులు తెప్పించుచుండెడి

వారు. గాజుతో వీరు ముఖ్యముగా రంగు రంగుల పూసలను తయారు చేయుచుండిరి. వీనిని అన్ని దేశముల వారును, అందు ముఖ్యముగా అనాగరక జాతులవారును కొనుచుండిరి. గాజు పరిశ్రమ ముఖ్యముగా సిడన్ నగరము నందు అభివృద్ధి చెందినట్లు తోచుచున్నది. ఇచ్చటి కర్మకారులు గాజుతో పాన పాత్రములను, పూల తొట్టెలను, గిన్నెలను సిద్ధము చేయుచుండిరి. వీని కన్నులకు ఆకర్షకము లగు రంగులు కూడ వేయబడు చుండెడివి. గుండ్రని యాకారము గల పెద్ద గాజు గొట్టములను వివిధములగు రంగులతో సిద్ధపరచుటకూడ, సిడన్ పట్టణమువా రెరింగి యుండిరి. ఏవైన యుత్సవములు, వివాహములు, మున్నగునవి జరుపబడి నప్పుడీ గాజు గొట్టములలో దీపములు వెలిగించి ప్రజలు తమ గృహముల నలంకరించుకొనెడివారు. చూపుడు అద్దములను తయారు చేయుట కూడ ఫినీషియా వారికి తెలియనిదికాదు. కాని గాజు పరిశ్రమ యందు ఫినీషియా దేశీయు లెంత వరకు కృతార్థు లైరను విషయమును నిశ్చయముగా స్థిరపరుప జాలము. గ్రీకు దేశపు పారిశ్రామికులును, ఫినీషియా దేశీయులును కూడ గాజు సామానులను విరివిగా చేయుచుండెడి వారు. కావున ఈ వస్తువులను గ్రీకు దేశీయులు నిర్మాణము చేసిరని కాని, వీనిని మరొక్కరు సిద్ధపరచి రని కాని రూఢిగా తెల్పుట కష్టసాధ్యము. బట్టల నేత యందు ఫినీషియా జాతికి చాల నేర్పుండెనని తెలుపవచ్చును. ఈ దేశీయులు, పట్టు, ఉన్ని, ప్రత్తి మున్నగు దినుసులతో వస్త్రములు నేయుచుండెడివారు. పట్టును పర్షియా దేశము

నుండి ఫినీషియా వర్తకులు ఏగుమతి చేసికొనెడివారు. ఈ పట్టునకు చక్కని రంగులు వేసి దానిని వస్త్రములుగా నేసినప్పుడు ఓదేశీయులీ వస్త్రములకై యెంతయో ధనమును వెచ్చించెడివారు. సిడన్ నగరము నందలి నేతగాండ్రు వస్త్రములకు చక్కని నగిషీలతో అంచులు సిద్ధపరచు చుండిరి. ఈ నగిషీ పని వలన సిడన్ వస్త్రములకై జనులు మిక్కిలి మక్కువ చూపెడివారు. ఫినీషియా దేశీయులు బంగారు, వెండి మున్నగు లోహములపై పని చేయుట యందు మిక్కిలి సమర్థులై యుండిరి. టైరు పట్టణపు కర్మకారులు జెరుసలేమ్ పట్టణమందలి యెహోవా దేవాలయమును నిర్మించిరని తెలిసి యున్నాము. ఇందు దేవపూజార్థము వాడబడు సామాను లన్నియును కూడ బంగారుతో చేయబడినవే. పళ్ళెములు,దీపపు హారతులు, చెంబులు మున్నగునవన్నియును కూడ స్వర్ణమయములే. ఈ వస్తువుల నన్నింటిని కూడ టైరు పట్టణపు పనివాండ్రు మిక్కిలి నేర్పుతో సిద్ధపరచిరి. ఇదే విధముగ సిడన్ నగరము నందు వెండితో వివిధము లగు సామానులను తయారు చేయుచుండెడి వారు. హోమరు అను గ్రీకు కవీశ్వరుడీ వస్తువులు మిక్కిలి అందముగా నుండెడివని వర్ణించి యున్నాడు. కంచును సిద్ధపరచి దానిపై వివిధము లగు బొమ్మలను చిత్రించుట యందు కూడ ఫినీషియా దేశస్థులు మిక్కిలి సమర్థత చూపిరి. తగరము, రాగి సమ్మేళనము వలన కంచు తయారగును. ఈ రెండు లోహములను ఏ వరవడిని కలుప వలయునో ఫినీషియా లోహకారులు బాగుగా నెరింగి

యుండిరి. ఇట్లు సిద్ధము కావింపబడిన కంచుపై జంతువులు, మనుష్యులు, నిత్య జీవిత మందలి ఘట్టములు మున్నగునవి మిక్కిలి సమర్థతతో ఫినీషియా శిల్పులు చిత్రించు చుండిరి.

ఫినీషియా వారు నౌకా నిర్వహణము నందు మిక్కిలి సమర్థులని యీవరకే తెలిపి యున్నాము. సముద్ర యానము నందు వీరాధునికులతో పోల్ప దగినంత సామర్థ్యమును సంపాదింప లేదు. కాని ఆ పురాతన కాలమునాటి స్థితిగతులను గుర్తించిన యెడల వారి చాతుర్యము ప్రశంసాపాత్ర మైనదే యని యెల్లరు నంగీక రింతురు. తామిదివరలో కావించిన సముద్ర ప్రయాణముల అనుభవమును బట్టి వారు సముద్ర మార్గముల పటములను సిద్ధపరచు చుండిరి. రాత్రుల యందు ప్రయాణము చేయునప్పుడు ధ్రువ నక్షత్రమును గుర్తుగా పెట్టుకొని వారు ముందునకు సాగిపోవు చుండెడివారు. సిడన్ పట్టణపు నావికులు ఖగోళ గణిత శాస్త్రములలో ప్రత్యేక ప్రజ్ఞ కల్గి యుండిరి. సముద్రపు పోటుపాట్లను గూర్చి కూడ వీరు అనేక విషయము లెరింగి యుండిరి. గనులను త్రవ్వి లోహములను తీయుటలో కూడ ఫినీషియా ప్రజలు మిక్కిలి నేర్పరులుగ నుండిరి. ఫినీషియా వారికడ నుండి యీ పద్ధతులను కార్థేజ ప్రజలును, కార్థేజి వారి నుండి రోమక ప్రజలును గ్రహించిరి. కాని కాలక్రమమున నీ పద్ధతులు శ్రేష్ఠతరముగను(?) సులభతరముగను కావింపబడి ఇంచుమించు నేటి వరకును ఆ సిద్ధాంతముల పైననే గనులు త్రవ్వబడు చున్నవి. కాని ఫినీషియా జాతివారు లోహము లొండొం

జాతిలో కలిసిపోయి నప్పుడు వారిని వేరుపరచుట సరిగా నెరుంగ కుండిరి. స్పైను దేశము నందు లోహములు సమృద్ధిగా లభించు చుండినందున ఫినీషియా వ్యాపారు లీ దేశములో గనులను త్రవ్వు చుండిరి. దంతముపై వివిధము లగు చెక్కడములు, బంగారు నగలు చేయుట యందును ఫినీషియా వారి సామర్థ్యము మిక్కిలి యున్నత శ్రేణిది. బంగారములతో కంఠహారములు, కంకణములు, దండకడియములు, ఉంగరములు, చెవుల కలంకారములును వీరు విరివిగ చేయు చుండిరి. ముద్రికలుగా వాడు ఉంగరములను కూడ వీరు తరచుగ తయారు చేయుచుండిరి. ఈ నగలపై వివిధము లగు నగిషీ పనులు, సింహము తల, సర్పముల యాకారములను చిత్రించు చుండిరి. కంఠహారము లలో పద్మములను, పూల మొగ్గలను బంగారుతో చేసి అమర్చు చుండెడివారు.

-: ఫినీషియా భాష :-

భావ ప్రకటనము నకై భాషయు, లిపియును మిక్కిలి ఆవశ్యకము. లిపి నిర్మాణము కావించిన జాతులలో ఫినీషియా వారు మిక్కిలి ప్రాచీనులుగ కాన్పించు చున్నారు. ఫినీషియా భాషయు, లిపియును కూడ సెమిటిక్ సంప్రదాయమునకు సంబంధించినవి. యూదుల భాష యగు హెబ్రూ భాషకును, ఫినీషియా భాషకును చాల సామ్యము కలదు. ఈ రెండు భాషల యందును కూడ ఇరువదిరెండు అక్షరములు మాత్రమే కలవు. హెబ్రూ పండితులకు ఫినీషియా లిపిని గ్రహించుట సులభసాధ్యము. లిపి నిర్మాణ

మును ప్రప్రథమమున ఫినీషియా వారే కావించిరని సర్వ సాధారణముగ తలంపబడుచున్నది. కాని యీ విశ్వాసము కొంత వరకు మాత్రమే సత్యమునై ఆధారపడి యున్నది. ఫినీషియా ప్రజలు లిపి నిర్మాణము కావించుటకు వేయి సంవత్సరములకు పూర్వమే ఈజిప్టు వారు భాష యందలి శబ్దములను సూచించుటకై గుర్తుల నేర్పాటు కావించుకొనిరి. బాబిలోనియా, అస్సీరియా, ఎలామ్ మున్నగు దేశ ప్రజలు కంచుమించు ఇదే కాలమున తమ తమ భాషలకు లిపిని నిర్మించుకొనిరి. కాని యీ లిపులు వేని యందును కూడ సౌలభ్యము లేకపోయెను. ఒకే శబ్దమునకు వేరు వేరు గుర్తులనేకము లుండుటచే ఆయాభాషలను వ్రాయుట యందును, చదువుట యందును కూడ మిక్కిలి చిక్కు కలుగుచుండెను. ఈజిప్టు భాషయందు రమారమి వేయి గుర్తులును, బాబిలోనియా అస్సీరియా భాషలలో సుమారు మూడునూర్ల గుర్తులును ఉన్నట్లు ప్రాచీన చరిత్ర పరిశోధకులు తెల్పుచున్నారు. ఈ భాషల యందు సంపూర్ణజ్ఞానము సంపాదించుటకై ఎన్నియో సంవత్సరములు కృషిచేయవలసి వచ్చెడిది. ఇట్టి దుష్కర లిపిని సంస్కరించి, దానిని సులభతమముగా కావించి దానిని ప్రచారములోనికి తెచ్చిన గౌరవము ఫినీషియావారికి మాత్రము దక్కినది. ఈ లిపిని ఫినీషియావారే నిర్మాణము చేసిరా, లేక మరే యితరజాతులవారి వద్దనుండి యైన గ్రహించిరా యని పండితులు తర్కోపతర్కములు కావించి యున్నారు. పలువురు చారిత్రకులు ఫినీషియావారు స్వతంత్రముగనే లిపి నిర్మాణము కావించిరనియు, ఇతర లిపులతో

దీనికిగల సామ్యము యాదృచ్ఛికమనియు తలంచుచున్నారు. ఫినీషియా ప్రజలు వ్యాపారస్థులైన కారణమున వారికి వ్యాపార సంబంధములైన లెక్కలు వ్రాసికొనుటయు, ఇతర వణిజులతో సుత్తరప్రత్యుత్తరములు జరపుటయు మిక్కిలి ఆవశ్యకముగా కాన్పించినందున వీరు లిపి నిర్మాణము విషయమై ప్రత్యేక కృషిని సల్పి అందుకృతార్థులైరని తలంచుట అసమంజనము కానేరదు. ఫినీషియా జాతివారు మధ్యధరా సముద్రమునందు తరచుగ తమ నౌకలలో ప్రయాణముచేయుచు వ్యాపారము సాగించు చుండెడివారు. ఈ కారణమున గ్రీకు రోమను ప్రజలతో వీరికి సంయోగము తటస్థించెడిది. ఫినీషియా వారువాడెడి లిపి మిక్కిలి ఉపయోగ కరముగను సులభ సాధ్యముగను కాన్పించినందున వీరాలిపినే అనుకరించిరి. లాటిన్ గ్రీకు భాషల లిపికిని, ఫినీషియా లిపికిని సామ్యముండుట గమనింపగగిన విషయము. సెమిటిక్ భాష లన్నిటికి వలెనే ఫినీషియా భాషను కూడ కుడినుండి ఎడమవైపునకు వ్రాయుదురు. ఫినీషియా భాషయందు గ్రంథము లెక్కువగా కానరావు. ఈ భాషయందు వ్రాయబడిన శాసనములు మాత్రము కొన్ని లభ్యమగుచున్నవి. ఫినీషియా దేశపు చరిత్ర నొక స్థానిక విద్వాంసుడు స్వభాషలోనే రచించె ననియు, దాని ననుసరించి ఫిలో యనునతడు గ్రీకుభాషలో వేరొక పుస్తకమును కూర్చెననియు తెలిపి యున్నాము. ఫినీషియా చరిత్రకు మూలమైన ఈగ్రంథము నందలి కొన్నిభాగములు లభ్యమగుచున్నవి. ఈగ్రంథమునందు పూర్వరాజుల వృత్తాంతమును మరి కొన్ని యపూర్వ విషయములును వర్ణింపబడి యున్నవి.

కళాదృష్టిచేతను, వాఙ్మయ దృష్టిచేతను, పరిశీలించిన యొడల పై రచనలయందు విశేషమేమియు కానరాదని విమర్శకులభి ప్రాయ పడుచున్నారు.

ఫినీషియా చరిత్రను మిక్కిలి సంగ్రహ రూపమున తెలిసికొని యున్నాము. దీని వలన ఆప్రజల యందలి గుణ లోపముల గ్రహింపగలిగిన స్థితిని మనము పొందితిమి. ఈజాతి వారు కార్యరంగము నందే తమ శక్తి సామర్థ్యములను ప్రక టించిరి: వీరిది వ్యాపారము నందును, నౌకా నిర్వహణము నందును సిద్ధహస్తము. వస్త్రముల నేత, దానికి రంగులు వేయుట, లోహములగు భూగర్భమునుండి త్రవ్వి శుభ్రపరచుట, వానిపై వివిధములగు చెక్కడపు పనులు, నగలు తయారు చేయుట, శిల్పకళ, వాస్తు శాస్త్రము మున్నగువాని యందు వీరిసామర్థ్య మత్యద్భుతమైనది. ఈ శక్తి సామర్థ్యములకు తోడు కష్టసహి ష్ణుత, ధైర్యసాహసములు, సమయోచిత బుద్ధి మున్నగు సద్గు ణములు నెలకొని యుండినందున, ఈజాతివారు భోగలాల సత్వమనగా నెట్టిదియో యెరుంగక క్రీ- పూ- 13 వ శతాబ్ది నుండి క్రీ- పూ- నాల్గవశతాబ్ది వరకును మిక్కిలి యుచ్ఛదశ ననుభవించిరి. ఆ మీదట కూడ మరి యారు శతాబ్దుల వర కును వీరి నాగరకతా చిహ్నములు కాన్పించుచునే యుం డెను. రోమక సామ్రాజ్య వ్యాప్తి వలనను, ఆ సామ్రాజ్యము వారవలంబించిన దమన నీతివలనను ఫినీషియా జాతి వ్యక్తి త్వము సంపూర్ణముగ నశించెను.

★

# కార్థేజియనులు

ఔన్నత్యప్రసిద్ధి గాంచిన ప్రాచీన రాజ్యములలో కార్థేజి రాజ్య మొకటి. కార్థేజి అను నది ఒక పట్టణము. ప్రాచీన యుగములందొక ప్రసిద్ధ పట్టణమును దాని పరిసరము లందలి కొన్ని గ్రామములును కలసి యొక పట్టణ రాజ్యముగ నేర్పడుచుండుట పరిపాటిగ నుండెను. గ్రీసు దేశమున ఏథెన్సు, స్పార్టా అను సుప్రసిద్ధము లగు నగర రాజ్యములు గొప్ప ఖ్యాతిని గాంచెను. రోము నగర రాజ్యమే కాలక్రమమున మహోత్తర వికాసము నంది రోమక సామ్రాజ్యముగ పరిణమించెను. కార్థేజి నగరము ఆఫ్రికా ఖండము యొక్క ఉత్తర భాగమున సముద్రతీరమున స్థాపింపబడెను. ఇయ్యది ఫినీషియా ప్రజలచే స్థాపింపబడి వారి సాంప్రదాయములు, సభ్యత మున్నగు వానిని అవలంబించిన కారణమున కార్థేజి రాజ్యము ఫినీషియా వారికి వలస రాజ్యమువంటి దని తెలుప వచ్చును.

-: కార్థేజ నగర స్థాపనము :-

ఈ నగర స్థాపనమును గూర్చిన యొక గాథ మిక్కిలి ప్రఖ్యాతి గాంచినది. టైరు పట్టణాధిపతి యగు

మాటన్ రాజునకు ఎలిస్సా యను కుమార్తెయు పిగ్మాలియన్ అను కుమారుడును ఉండిరి. తండ్రి చనిపోవు నప్పటికి పిగ్మాలియన్ మిక్కిలి చిన్నవాడు. కావున అతని కంటె వయస్సున పెద్ద దైన ఎలిస్సాను రాజ్య పరిపాలనము కావించుటకై మాటన్ రాజు నియమించెను. ఈమె యుక్తవయస్కురాలై యున్నందున ఈమెకు మేనమామ యగు సికార్బస్ అను నాతడు వివాహ మాడెను. ఈ సికార్బస్ మిక్కిలి ధనాఢ్యుడు. పలుకుబడి గలవాడు. టైరు నగరము నందలి యొక ఉన్నత వంశము నందు జన్మించినవాడు. ఈతడు మెల్కార్త్ దేవునికి పురోహితుడుగ కూడ నుండెను. ఈతని పలుకుబడి మున్నగువానిని చూచి అసూయ పడియు, ఈతని యైశ్వర్యమును చేజిక్కించు కొనవలె నను పేరాస చేతను, పిగ్మాలియన్ తన బావ యగు సికార్బస్‌ను చంపించెను. భర్త మరణము వలన ఎలిస్సాకు చాల దుఃఖము కల్గి టైరు పట్టణమును వీడి ఎచ్చటి కైన వెడలిపోయి శాంతముగ జీవింప వలెనని ఆమె నిశ్చయము పూనెను. కాని సోదరుడైన పిగ్మాలియన్ తన భర్త యొక్క అపార సంపద నపహరింప నిశ్చయించి యున్నట్లు తెలిసికొని, ధన మాతనికి చేజిక్క కుండుటకై ఆమె ఒక ఉపాయ మాలోచించెను. భర్త చనిపోయి నందున తాను సోదరు డగు పిగ్మాలియన్ గృహము నందే నివసించుటకు నిశ్చయించి నట్లు ప్రకటించి, తనకు సంబంధించిన వస్తుజాలమును అతని (పిగ్మాలియన్) యింటికి చేర్చుటకై కొన్ని పడవలు పంపవలసినదని ఎలిస్సా తన సోదరునకు వర్తమాన మంపెను. పిగ్మాలియన్ తనకు

నమ్మినబంటులైన కొందరి నాయోడలలో పంపి, ఎలిస్సా వద్దనున్న ధనమంతయు తనయొద్దకు తీసికొని రావలసిన దని వారి కాజ్ఞ యొసంగెను. యుక్తిపరురాలగు ఎలిస్సా తన భర్త యొక్క ధనము నంతయును ఎచ్చటనో దాచివైచి, ఇసుకతో నింపబడిన సంచులను తన సోదరుడు పంపిన అధికారులకు చూపి వానియందు తన భర్త ధనమును నింపినట్లు తెల్పెను. వారీ సంచుల నోడలలోనికి చేర్పించి ప్రయాణము సాగించిరి. ఓడలు సముద్ర మధ్యమునకు పోవుసరికి, ఎలిస్సా తన భర్త యాకారము తనకు కాన్పించి నట్లు నటించి, ఆతని తృప్తి పరచు నిమిత్తమై ఆతని ధనరాసులను సముద్రము పాలు చేయుచున్నానని పల్కుచు, తన సేవకులచే ఇసుక సంచుల నన్నిటిని సముద్రములో త్రోయించెను. పిగ్మాలియన్ అనుచరు లీ చిత్రమును నిర్ఘాంతపడి చూచుచుండిరి. అప్పు డామె తన సోదరుని ఉద్యోగులతో వారు పిగ్మాలియన్ కడకు తిరిగిపోయిన యెడల నాతడు వారిని కఠినముగ శిక్షించు ననియు, కావున వారందరును తన పక్షమునే అవలంబించి తనకు భృత్యులై చరింప వలసిన దనియు వాదించెను. కర్తవ్య నిర్వహణము నందు ప్రమత్తులై వర్తించి నందులకు పిగ్మాలియన్ తమ్ము శిక్షింపక మానడని భయపడి, ఆ యుద్యోగు లెల్లరును ఎలిస్సాను సేవించుట కంగీకరించిరి. ఈమె అప్పు డోడల నన్నిటిని ఆఫ్రికా ఖండమునకు పోనిచ్చి అచ్చట సుప్రసిద్ధమగు కార్థేజి నగరమును స్థాపించెను.

ఈ గాథను వివిధ చారిత్రకులు వివిధ మార్గముల విమర్శించి యున్నారు. కాని పిగ్మాలియన్ ఎలిస్సాలను తమ్ముడును అక్కయును ఉండియుండ వచ్చుననియు, వారికి కారణాంతరములచే భేదాభిప్రాయము ఉద్భవించి నందున ఎలిస్సా కొందరు టైరు పట్టణవాసులతో తన జన్మ భూమిని వీడి ఆఫ్రికా ఖండమునకు పోయి అచ్చట కార్థేజి నగరమును స్థాపించి యుండవచ్చు ననియు పలువురు చరిత్ర కారులు తలంచుచున్నారు. ఈ నగర స్థాపనమునకు కారణము లేవియైనను, దీనిని టైరు పట్టణమువారే స్థాపించి నారను సంశయము మాత్ర మెల్లరు నంగీకరించు చున్నారు.

-: రోమక పురాణ గాథ :-

కార్థేజి నగరమును స్థాపించిన ఎలిస్సాకు సంబంధించిన యొక గాథ రోమను పురాణములలో కానవచ్చు చున్నది. ప్రాచీనకాలము నందు గ్రీకు ప్రజలకును, ట్రాయ్ పట్టణ వాసులకును భయంకర మగు నొక యుద్ధము ప్రవర్తిల్లెను. దీనికి ట్రోజన్ యుద్ధ మని పేరు. ఇందు ట్రాయ్ వీరు లనేకులు పాల్గొనిరి. వారిలో ఏనియస్ అనువా డొకడు. యుద్ధమునందు తన పక్షమువా రెల్లరును ఓడి, ట్రాయ్ పట్టణము నశించిన వెనుక ఏనియస్ ఇటలీ దేశమునకు పోవుటకై బయలు వెడలెను. ఆత డచ్చట నొక యద్భుతమైన పట్టణమును స్థాపించి, యొక మహత్తర రాజ్యమునకు పునాది వేయగలడని దైవ నిర్ణయమై నట్లు ఏనియస్ కు

తెలియవచ్చెను. ఇటలీ దేశమునకు ప్రయాణము చేయు చున్న ఆతని కనేక కష్టములు సంభవించెను. గ్రీకు వీరుల కనుకూలురాలును, ట్రోజను యోధులకు బద్ధ శత్రువునైన జ్యూనో దేవత కారణము వలన మధ్యే మార్గమున ఏనియస్ పడవ లొక భయంకరమైన తుఫానులో చిక్కుకొనెను. మారుత దేశమున వారి యోడలు సరియైన త్రోవనుండి తప్పి పోయి ఆఫ్రికాఖండము వైపు కొట్టుకొనిపోయెను. సము ద్రాధిపతి యగు నెప్ట్యూన్ దేవుడు ఏనియస్ యెడ మిక్కిలి దయకల్గి యుండెను. కావున నాతడు భయంకరమగు నా తుఫానును శాంతింపజేసి ఏనియస్ ఆతని పరివారమును కాపాడెను. వారు సమీపము నందే నెలకొని యున్న కార్థేజ పట్టణమును చేరిరి. ఆ పట్టణమునకు రాణి డీడో యను నామె. (డీడో ఏలిస్సాకు నామాంతరము) విదేశీయులు కొందరు తన పట్టణమునకు వచ్చినట్లు విని ఆమె వారికి హృదయపూర్వకముగ స్వాగత మొసంగెను. ఆగంతుకులకు నాయకుడైన ఏనియస్‌కు రాజ భవనమునందే విడిది యిచ్చిరి. అచ్చట ఆతనికి సర్వవిధములైన మర్యాదలును కావింపబడెను. ఏనియస్ ప్రభృతులు కొన్ని దినములపాటు విశ్రమించి మార్గాయాసము నుండి సేదతీరిన వెనుక రాణి ఏనియస్‌ను రావించి ట్రోజను యుద్ధపు వీరగాథల నన్నిటి ఆతని నోటి నుండి మిక్కిలి కుతూహలముతో వినెను. ఏని యస్ కావించిన సాహసకార్యములను వినినకొలదియు రాణి కాతని యెడ అపారమగు గౌరవమును, అఖండమగు

ప్రేమయు కలుగజొచ్చెను. విగత భర్తృకయైన డీడో ఆతనిని తన హృదయ రాజ్యమునకును, కార్థేజి రాజ్యమునకును అధిపాధునిగ కావించుకొన వలయునని నిశ్చయించుకొనెను. ఏనియస్ తన రాజ్యమును విడచి వెడలిపోవుట ఆమె కొక మహాపదగ కాన్పింపసాగెను. ఆతనికితనయందును తన రాజ్యమునందును మక్కువ కలుగుటకై రాణి నిత్య వినోదముల తోడను, ఆటపాటల తోడను, ఆనంద విలాసముల తోడను, ఏనియస్ చిత్తమును వశపరచు కొనుటకై యత్నించెను. కార్థేజినగర వైభవముచేఆతనికి కన్నులునిరుమిట్లుగొల్పునట్లు చేసెను. ఏనియస్ కార్థేజి రాణి కావించిన సత్కారమునకును, ఆమె తనయెడ చూపిన గౌరవాభిమానములకును మిక్కిలి సంతసించి, ఆమెతో తరచు సంభాషించుచు ప్రేమాలాపములను కూడ ప్రారంభించెను. కాని దేవగణములు ఏనియస్ కొరకై తాము నియమించిన కార్యము నాతడు విస్మరించుట కెంతమాత్రము నంగీకరింపలేదు. దేవతలకు రాజగు జ్యూపిటర్ దేవదూత యగు మెర్క్యూరీ అను నాతనిని ఏనియస్ వద్దకు పంపి, ఆతడు కార్థేజి నగరమునందు వినోదసాగరమున నోలలాడుటకు వలనుపడ దనియు, తక్షణమే ఇటలీ దేశమునకు వెడలిపోవలయు ననియు ఆజ్ఞాపించెను. దైవ శాసనమును వినినతోడనే ఏనియస్ మనము నావరించియున్న మోహాంధకారము విరిసిపోయెను. ఇటలీ దేశమునకు పోవుటకై ఓడలను సిద్ధపరుప వలసినదని యాతడు తన యనుచరులకు సెలవొసంగెను. ఏనియస్ నిశ్చయమును వినుసరికి డీడో రాణి కత్యంత మగు ఆశాభంగమును, ఆగ్రహ

ముపు, దుఃఖమును కల్గెను. అనురక్తురాలగు తన్ను వీడిపోవు చున్నందుల కామె ఏనియస్‌ను పరిపరి విధముల నిందించి, తుద కాతనిని కార్థేజి రాజ్యమునకు రాజుగ తనకడ నివసింప వలెనని కోరెను. ఏనియస్ కేమిచేయుటకును పాలుపోలేదు. ఆతడు డోలాందోళిత మానసుడై తన నిశ్చయమును తరువాత తెల్పెదనని రాణికడ సెలవు గైకొనెను. రాణి యాడిన ప్రేమ భాషణములును, దీనాలాపములును, ఏనియస్ మనస్సును కరగించెను. ఆమరునా డాతడు డీడో రాణి కోర్కెననుసరించి కార్థేజి నగరమున నివాసముగ నుండిపోవుటకే నిశ్చయించి యుండెడివాడు. కాని రాత్రి యాతడు నిద్రించు చున్నప్పుడు దేవదూత యగు మెర్క్యూరీ మరల యేతెంచి, ఆతడు తత్క్షణమే కార్థేజి నగరమును వీడి వెడలిపోవలయుననియు, తెల్లవారిన తరువాత రాణి యాతని ప్రయాణమునకు తప్పక ఆటంకము కల్గించుననియు, ఏనియస్‌ను హెచ్చరించెను. ఏనియస్ తత్క్షణమే మేల్కాంచి సముద్రతీరమునకు వెడలి, నావికులను తొందరపరచి తెల్లవారకమునుపే కార్థేజి నగరము నుండి వెడలిపోయెను. ఆమరునా డుదయముననే రాణికి వర్తమానము తెలియవచ్చెను. భగ్న ప్రణయ యగు నామెకు జీవితముపై విరక్తి జనించెను. మొట్టమొదటి పర్యాయము ఏనియస్‌కు స్వాగతమొసంగిన సందర్భమున తాను ధరించిన యుడుపులనే మరల ధరించి, తన కొరకై సిద్ధపరువబడిన చితిపై నెక్కి ఖడ్గముచే తన హృదయమును ఛేదించుకొని డీడో రాణి మరణించెను. అవసానకాలమున నామె ఏనియస్ నామముసే జపించుచు ప్రాణములనువీడెను. కార్థేజి

నగరమును స్థాపించిన ఎలిస్సా హతభాగ్యురాలై ఈ విధ
ముగ మరణించినట్లు పురాణములు తెల్పుచున్నవి. మహాకవి
యగు వర్జిల్ అను రోమక దేశీయుడు తాను రచించిన ఏని
యడ్ అను మహాకావ్యమునం దీగాథను మిక్కిలి రసవంత
ముగ వర్ణించియున్నాడు. డీడో మరణించిన తరువాత నొక
పర్యాయము ఏనియస్ యమలోకమునకు పోవుట తటస్థిం
చెను. అచ్చట డీడో యాతనికి సూక్ష్మరూపమున కాన్పిం
చెను. ఆమెను పల్కరించుటకై ఏనియస్ సమీపించెను.
కాని యాతడు తన వలపును నిరాకరించి, తన్ను మోసగించి
వెడలిపోయిన యంశమును డీడో మరచిపోలేదు. కావున
నామె ఏనియస్‌ను చూచినతోడనే కోపముతోడను, జుగుప్స
తోడను, పెడమొగము పెట్టి అచ్చటి నుండి వేరొక ప్రదేశ
మునకు వెడలిపోయెను.

-: రోమక పట్టణ స్థాపనము :-

మరికొంతకాలమునకు దైవనిర్ణయము ప్రకారము ఏని
యస్ ఇటలీ దేశమునం దొక గొప్ప పట్టణమును స్థాపించి
దానికి తన భార్య గౌరవార్థము లెవీనియం అను పేరు
పెట్టెను. ఈతని వంశస్థులే జగత్ప్రసిద్ధి గాంచిన రోము పట్టణ
మునకు పునాది వేసిరట. వర్జిల్ మహాకవి రచించిన ఈ గాథ
చారిత్రికులు సత్యవిషయముగా నంగీకరింపకపోవచ్చును. కాని
అందొక చారిత్రిక సత్యము మాత్రము తప్పక గలదు.
కార్థేజి రాజ్యమును, రోమక రాజ్యమును కూడ ఇంచు
మించు ఒకే కాలమున స్థాపింపబడినట్లు దీని వలన వ్యక్త

పడును. మధ్యధరాసముద్రమునకు దక్షిణమునను ఉత్తరమునను నెలకొనిన ఈ రాజ్యములు కొంతకాలము వరకును స్నేహభావమును నెరపెను. కాని తుట్టతుదకు రోమక రాజ్యము కార్థేజి రాజ్యమును నాశనము చేసిన విషయమును మనము ముందుముందు తెలిసికొనగలము. కార్థేజి పట్టణము క్రీ. పూ. 814 వ సంవత్సరమున నెలకొల్పబడినట్లు చారిత్రికు లూహించుచున్నారు.

చిరకాలము మహోన్నత దశ ననుభవించిన వెనుక కార్థేజి నగరము రోమక ప్రజలచే సంపూర్ణముగ నాశనము కావింపబడెను. రోమనులు కార్థేజి ప్రజలపై కక్ష వహించి ఆ పట్టణ మందలి గ్రంథాలయములను, ఇతర పత్రములను అగ్నిపాలు కావించిరి. వ్యవసాయ శాస్త్రమును గూర్చిన యొక ఉద్గ్రంథము మాత్రము నాశనముకాక చిక్కెను. అయ్యది ల్యాటిను భాషలోనికిని, గ్రీకు భాషలోనికిని అనువదింప బడెను. కార్థేజి నగరమును గూర్చి మనకు లభ్యమైన విషయము లన్నియు వారికి బద్ధశత్రువులగు రోమనుల వ్రాతల వలన తెలియవచ్చినవి. రోమనులు తెల్పిన విషయములు ద్వేషపూరితములై యుండుట సహజము. అయినను సిసిరోవంటి రోమక విజ్ఞాని కార్థేజిజాతి వారిని గూర్చి వ్రాసిన యంశములను చూచిన యెడల కార్థేజివారి యౌన్నత్యము ద్యోతకము కాగలదు. ఏడు శతాబ్దముల కాలము మహత్తరమగు కీర్తి ప్రఖ్యాతులతో నిలువగల్గి యుండుటయే ఆ జాతి వారి ఘనతకు గొప్ప నిదర్శనము.

.: గ్రీకులతో యుద్ధములు :-

కార్థేజి ప్రజలు కూడ తమకు మాతృక యగు ఫినీషియా జాతి నాగరకతనే అవలంబించి ఇతర దేశములతో వర్తకము సాగించెడివారు. వ్యాపార విషయము లందు వారికితర జాతులతో స్పర్ధలు కల్గుటయు, వైరము సంభవించుటయు కూడ జరుగుచుండెను. కార్థేజి నగరము స్థాపింపబడిన తర్వాత ఒకటిన్నర శతాబ్దాల వరకును వారు సిసిలీ, సార్డీనియా, కార్సికా ద్వీపముల తోడను, ఇటలీ స్పెయిను దేశముల సముద్రతీర ప్రాంతముల తోడను విస్తారముగ వ్యాపారము జరుపుచుండిరి. ఆపైన ఎట్రుస్కనులును, గ్రీకు ప్రజలును కార్థేజ నివాసులతో పోటీకి రాసాగిరి. ముఖ్యముగ గ్రీసు దేశస్థుల వలన కార్థేజివారి వ్యాపారాదుల కెక్కువ నష్టము కల్గు నవకాశములు చూపట్టసాగెను. క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్ది యంతమునను, ఏడవ శతాబ్ది ప్రారంభము నందును గ్రీకులు సిసిలీ ద్వీపములో అనేక పట్టణములును, వర్తక కేంద్రములును స్థాపింపసాగిరి. కావున కార్థేజి పౌరులు ఎట్రుస్కనులతో సంధి చేసికొని, తమ కిరువురకుని కూడ పోటీవారలుగ నున్న గ్రీకుల నోడింపవలెనని నిశ్చయించుకొనిరి. క్రీ. పూ. 536 వ సంవత్సరమున గ్రీకులకును కార్థేజి వారికిని యుద్ధము సంభవించెను. ఎట్రుస్కనులు కార్థేజివారి పక్షము నవలంబించిరి. వీరిరువురు నేకమై గ్రీకులు కార్సికా ద్వీపమునందు నివాసము లేర్పరచుకొనకుండునట్లు కావించిరి. క్రీ. పూ. 480 వ సంవత్సరమున కార్థేజి నగరమువారు సిసిలీ ద్వీపములో తమ సేనలను

డించిరి. ఆ కాలమునందు గ్రీకులకును, పారసీక దేశపు వారికిని యుద్ధములు సాగుచుండెను. ఫినీషియావారు పారసీక రాజునకు మిత్రులు. కావున ఫినీషియా ప్రజలు తమ సోదరులగు కార్థేజి పౌరులను ప్రోత్సహించి సిసిలీ ద్వీపముపై దండెత్తి, గ్రీకులకు మిత్రుడగు సైరకూస్ రాజునకు పని కల్పింపవలయునని కోరిరి. ఈ యుద్ధము నందు కార్థేజి సేనలు సంపూర్ణముగ పరాభవింపబడెను. వారి సేనాధిపతి యగు హామిల్కారు అను నాతడు రణరంగమున చంపబడెను. క్రీ. పూ. 410 వ సంవత్సరమున కార్థేజి ప్రజలు హామిల్కారు మనుమడైన హానిబాల్ అను నాతని యాధిపత్యమున మరియొక సేనను సిసిలీ ద్వీపముపై పంపిరి. ఆతడు సిసిలీ సేనల నోడించి, పట్టణములను ధ్వంసము చేసి, ప్రజలను సంహరించి, పలువురను బానిసలుగ అమ్మివైచెను. దీని తరువాత సుమారు ముప్పది సంవత్సరముల వరకును సిసిలీ ద్వీపములోని గ్రీకులకును, కార్థేజివారికిని యుద్ధములు నడచెను. ద్వీపమునంతను జయించి స్వాధీనము చేసికొనవలెనని కార్థేజవారు ప్రయత్నించిరి. వారిని సంపూర్ణముగ సిసిలీ ద్వీపము నుండి తరిమివేయవలెనని గ్రీకులు ఆలోచించిరి. కాని వీరిరువురును కూడ తమ యుద్దేశ్యమును సాధింపజాలరైరి. తుదకు క్రీ. పూ. 383 వ సంవత్సరమున సిసిలీ దేశమందలి గ్రీకు రాజగు డయోనీసియస్ అను నాతనికిని కార్థేజ వారికిని సంధి ఘొసగెను. సిసిలీ ద్వీపమును రెండుగ విభజించి హాలికస్ నదిని తమ రాజ్యములకు సరిహద్దుగ నిరుపక్షముల వారును అంగీకరించిరి. ఈ సంధి యొక శతాబ్దమువరకును నిలిచి యుండెను.

క్రీ. పూ. ౩౪౮ వ సంవత్సరమున కార్తేజి ప్రజలకును రోమక ప్రజలకును స్నేహము కుదిరెను. ఆకాలమున రోము పట్టణము దుస్థ్సిర స్థితి యందుండెను. అనాగరక జాతుల వారు రోము నగరముపై దండెత్తి దానిని పరశురామప్రీతి కావించిరి. కాని అతి శీఘ్రకాలములో రోమనులు తమ సేనను వృద్ధిపరచి బలపడిరి. కాని వారికడ నౌకా సైన్యము లేనందున వారు కార్థేజి ప్రజలతో సంధి చేసికొనుట మంచి దని నిశ్చయించి అట్లు కావించిరి. ఈ సంధి ననుసరించి రోమను జాతివారికి సిసిలీ ద్వీపము, ఆఫ్రికాఖండము, సార్డినియా ద్వీపములతో వ్యాపారము చేయుటకు హక్కు లభించెను. కార్థేజి ప్రజలు రోము నగరముతో నిరాటంకముగ వర్తకము సాగింప జొచ్చిరి.

క్రీ. పూ. ౩౪౦ వ సంవత్సరమునందు సిసిలీ ద్వీపమును సంపూర్ణముగ జయింప వలెనని కార్థేజి ప్రజలు ప్రయత్నించిరి. వారికడ బలవత్తరమగు సేన కూడ సిద్ధముగ నుండెను. కాని వారి సేనా నాయకుల అసమర్థత వలన కార్థేజి వారికి విజయ లాభము కల్గుటకు మారుగ సంపూర్ణమగు పరాభవము సిద్ధించెను. కాని సిసిలీ ద్వీపములోని పశ్చిమ ప్రాంతము వారి యధీనము నుండి పోలేదు.

క్రీ. పూ. ౨౮౦ వ సంవత్సరము ప్రాంతమున పిరస్ అను గ్రీకు రాజు ఇటలీ దేశముపై దండెత్తి, ఆ దేశమును కార్థేజినగరమును కూడ జయింప వలెనని ప్రయత్నించెను. గ్రీకు ప్రజలను ప్రోత్సహించి కార్తేజి నగరము నాక్రమింప వలెనని ఆతడు తలంచెను. కాని ఆతడు కృతకృత్యుడు కాలేదు.

రోమను ప్రజల తీవ్ర ప్రతిఘటన వలన పిరస్ రాజు ఇటలీ దేశమును కూడ విడచి పోవలసి వచ్చెను. ఈ యుద్ధమునందు కార్థేజి ప్రజలు తమ నౌకా సైన్యముతో రోమను ప్రజలకు తోడ్పడి పిరస్ రాజును సంపూర్ణముగ పరాభవించిరి. ఈ యుద్ధమునకు ఫలితముగా సిసిలీ ద్వీప మందలి చాల భాగము కార్థేజి వారి వశమయ్యెను.

-: రోముతో వైరము: మొదటి ప్యూనిక్ యుద్ధము :-

క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్ది యందు రోమనులు కార్థేజి వారును కావించుకొనిన వర్తక సంధి సుమారు డెబ్బది సంవత్సరముల వరకును ఇరుపక్షముల వారిచే సక్రమముగ, అనుసరింపబడెను. రెండు జాతుల వారును ఒండొరులతో శాంతముగ వ్యాపారము చేయుచు, ఇతర రాజ్యము నందలి ప్రజలకు గాని సొత్తునకు గాని భంగము కలుగకుండు నట్లు వర్తించిరి. కాని క్రీ. పూ. మూడవ శతాబ్ది ద్వితీయ పాదమున రోమనులకును, కార్థేజి వారికిని స్పర్థ లంకురించి యుద్ధములు సాగెను. ఈ యుద్ధములకు కారణములు రాజకీయ విభేదములే కాని వ్యాపారపు పోటీలు కావు. ఈ కాలమునకు కొన్ని సంవత్సరముల పూర్వము నుండియు కార్థేజి వారు తమ వ్యాపారము మున్నగు వానిని రక్షించుకొను నుద్దేశ్యముతో సైన్యములను వృద్ధి చేసికొనసాగిరి. ఇంత వరకును వీరి వద్ద కొలదిపాటి నౌకా సైన్యము మాత్రముండెడిది. ఇప్పుడు వీరు భూసేనను కూడ సిద్ధపరచుకొన

జొచ్చిరి. ఈ కథాకాలమునాడు ఆఫ్రికా ఖండములోని నేటి లిబియా ప్రాంతము కార్తేజి ప్రజల వశమం దుండెను. వారు లిబియా ప్రజల నుండి పన్నుల గైకొనుటయేకాక, ఆ ప్రజలలో పలువురకు సైనిక శిక్షణ నొసంగి తమ పటాలములలో చేర్చుకొనసాగిరి. వ్యాపారమునందు విశేష ధనము నార్జించిన కార్థేజ ప్రముఖులు పలువురు లిబియా ప్రాంతము నందు భూములు సంపాదించి, ఐశ్వర్యవంతులైరి. మధ్యధరా సముద్రమున కుత్తర ప్రాంతమున రోమను ప్రజలు దినదినము బలవంతులై తమ సామ్రాజ్యమును విస్తరింప చేయవలెనని ఉవ్విళ్ళూరు చుండిరి. వారికి కార్థేజ వారి ఐశ్వర్యమును, బల సంపదయు కంటకముగ కాన్పింపసాగెను. ఈ విధముగ ద్వేషాగ్ని కొంత కాలము రగుల్కొనిన తర్వాత యుద్ధ జ్వాలలు భయంకరముగ ప్రజ్వరిల్లసాగెను. ఇందుల కింధన ప్రాయముగ నేస్వల్ప కారణ మైనను చాలును. రోమను ప్రజలకును కార్థేజి వారికిని సంభవించిన యుద్ధములు "ప్యూనిక్ యుద్ధము" లను పేరుతో చరిత్రయందు వ్యవహరింప బడుచున్నవి.

సిసిలీ ద్వీపము నందు యుద్ధమే వృత్తిగాగల ఒక తెగ ధూర్త ప్రజలు నివసించుచుండిరి. వారికి మెసీనా పట్టణము ముఖ్యస్థానముగ నుండెను. వీరు సిసిలీ ద్వీప మందలి యితర ప్రజలను దోచుకొనుచు కాలక్షేపము చేయుచుండిరి. వీరి యాగడమును సహింప జాలక సైరకూస్ రాజగు హీరో అను నాతడు వారిపై దండెత్తెను. (క్రీ. పూ. 270). ఈ దస్యు

జాతి వారు హీరో రాజు ధాటికి నిలువజాలక తమకు సహాయము పడవలసినదని రోము ప్రజలకును, కార్థేజ వారికిని కూడ వర్తమాన మంపిరి. రోమనులు మొదటనే సిసిలీ ద్వీపములో దిగిరి. కాని మొదటి నుండియు మెసీనా పట్టణములో నివాసముగ నున్న కార్థేజి ప్రజలు తమ స్వదేశమునకీ విషయమును గూర్చి తెలియజేయగా కార్థేజి ప్రభుత్వము కూడ ఒక సేనను సిసిలీ ద్వీపమునకు పంపెను. ఈ విధముగ మెసీనా యందు రోమనులకును, కార్థేజీ వారికిని ప్రత్యక్ష వైరము సంప్రాప్తించెను. రోమను సేనల కధిపతి యగు క్లాడియస్ అనువాడు కార్థేజి సేనల నాయకుని మాయోపాయముచే చెరపెట్టి, మెసీనా పట్టణమును కార్థేజి వారు వదలుకొను నట్లాతనిచే వాగ్దానము గైకొని ఆ పట్టణమును వశపరచుకొనెను. రోమనుల చర్య వలన కార్థేజి ప్రజలకు మిక్కిలి ఆగ్రహము కల్గి వారు తమ కవమానమును కల్గించిన సేనానిని వధించి రోమనులపై యుద్ధమును ప్రకటించి మెసీనా పట్టణమును స్వాధీనపరచు కొనుటకై యత్నించిరి. సైరకూస్ రాజగు హీరో కూడ కార్థేజి ప్రజల పక్షము నవలంబించెను. కాని రోమనుల వద్ద మిక్కిలి బలవత్తర మగు సేన యుండెను. కావున వారు కార్థేజి సైన్యములను సులభముగ నోడించిరి. హీరో రాజు మార్గాంతరము లేక రోమనులతో సంధి చేసికొనెను. (క్రీ. పూ. 263). వారు క్రమక్రమముగా సిసిలీ ద్వీపము నంతను జయించిరి. సముద్రతీరము నందలి కొన్ని వర్తక స్థానములు మాత్రము కార్థేజి వారి వశమున మిగిలిపోయెను.

ఈ విధముగ సిసిలీ ద్వీపములో పరాభవము సంభవించినను కార్థేజి ప్రజలు నిరుత్సాహము చెందక రోమనులతో యుద్ధమును సాగింపజొచ్చిరి. రోమనుల కడ బలవత్తరమగు స్థల సైన్య మున్నను వారు నౌకా సేన యందు కార్థేజి వారికి పోటీగ నిలువజాలకైరి. కార్థేజి నౌకలు సిసిలీ ద్వీపము నందు గల రోమను స్థావరముల పైనను, తుద కిటలీ దేశము పైనను కూడ దాడి చేసి కొల్లగొట్టుట ప్రారంభించెను రోమనుల వద్ద కొన్ని వ్యాపారపు టోడలు మాత్ర ముండెను. అవి కార్థేజి వారి యుద్ధ నౌకలకు సాటిరావు. అంతేకాక మొదటి నుండియు రోమనులకు నౌకా యుద్ధమునం దుత్సాహము కాని సామర్థ్యము కాని లేకుండెను. కార్థేజి నావికులకు నౌకా నిర్వహణమునం దపారమగు అనుభవమును, నేర్పును ఉండెను. కాని అవసరమును పురస్కరించుకొని రోమనులు కూడ నౌకా యుద్ధమునందు కొన్ని మెలకువలను నేర్చుకొనిరి. వారు తమ పడవ లన్నిటికిని ఒక కట్టె వంతెన నమర్చుకొనసాగిరి. ఈవంతెన నలుదిక్కులకును త్రిప్పుట కనువుగ నుండెను. శత్రు నౌకలు సమీపింపగనే రోమనులు తమ కట్టె వంతెనను క్రిందికి దింపి, శత్రు నౌకపై దానిని నిల్పి, సైనికులెల్లరును శర వేగముతో ప్రతిపక్షుల యోడలోనికి దిగి పోయెడివారు. రోమను సైనికులు క్రమశిక్షణ పొందినవారు. వారి కడ సమస్తమైన ఆయుధములును సిద్ధముగ నుండెడివి. కావున వారు కార్థేజి వారి పక్షమున పోరాడు చుండెడి అనాగరకులగు ఆఫ్రికా ప్రజల నవలీలగ నోడింపసాగిరి.

ఈవిధముగ సముద్రముపై కూడ కార్థేజి వారి ప్రాబల్యము క్షీణింపసాగెను.

క్రీ. పూ. 260 వ సంవత్సరమున మేలే అను ప్రదేశమున రోమనులకును కార్థేజి ప్రజలకును సంభవించిన నౌకా యుద్ధము నందు రోమనులకు సంపూర్ణ విజయము లభించెను. ఈ గెలుపు వలన ధైర్యము హెచ్చి రోమను సెనేటు సభ వారు తమ సేనల నాఫ్రికా ఖండముపై పంపుటకు నిశ్చయించిరి. రోమనులకును కార్థేజి వారికిని మరియొక నౌకా యుద్ధము సంభవింపగా అందు సైతము కార్థేజివారు ఓడిపోయిరి. అంతట రోమను సేనలు ఆఫ్రికా ఖండముపై దిగి కార్థేజి నగరమును ముట్టడింప వలెనని యత్నింపసాగెను. తమకు విజయములు నిరంతరము లభించుచుండుట వలన రోమనులకు గర్వము హెచ్చెను. వారు 15,000 సైన్యమును మాత్ర మాఫ్రికా యందు నిల్పి మిగిలిన సేనను వెనుకకు పంపివైచిరి. ఈ సేనకు రెగులస్ అను నాతడు నాయకుడు. ఈతడు ప్రథమ దశ యందు కార్థేజి రాజ్యము లోని పెక్కు పట్టణములను జయించి కార్థేజి ప్రజలకు భయోత్పాతము కల్గించెను. కార్థేజి వారు రోమనులతో సంధి చేసికొనుటకై సంసిద్ధులైరి. కాని రెగులస్ విధించిన షరతులు మిక్కిలి కఠినముగ నుండుటచే సంధి కుదురలేదు. ఈ సంవత్సరమున కొందరు గ్రీకు సైనికులు కార్థేజి వారి కడ కొలువుగ కుదిరి రోమనులతో యుద్ధమునకు పూనుకొనిరి. రెగులస్ వీరి ధాటికి తాళజాలక ఓడిపోయెను. కార్థేజి వారు రెగులస్‌ను చెర

పట్టిరి. క్రీ. పూ. 255. ఆ కాలము నందు రోమక ప్రజలయం దున్నత తరగతుల వారిలో సర్వసామాన్యముగ కానవచ్చు చుండెడి ధీరత్వమునకును, సత్యవాక్పరత్వము నకును రెగులస్ ప్రవర్తన మొక ఉజ్జ్వల నిదర్శనము. ఈతడు కొంతకాలము చెరలో నున్న వెనుక కార్థేజి ప్రజ లీతనిని విడుదల చేసి, రోము దేశమునకు పోయి తమకును రోము దేశమునకును సంధి కుదుర్చుటకై సర్వవిధముల ప్రయత్నింప వలసినదనియు, సంధి పొసగని పక్షమున ఆతడు తనంతట తానే మరల కార్థేజికి తిరిగి వచ్చి కారాగారమున నివసింప వలయుననియు నిర్ణయము కావించిరి. రెగులస్ అందుల కంగీకరించి రోము నగరమున కేగి సెనేటు సభవారి మ్రోల గంభీరోపన్యాసము కావించి, రోము ప్రజలును, కార్థేజి ప్రజలును సంధి కాంక్షించు కొని స్నేహభావముతో వర్తించుట ఇరుపక్షముల వారికిని మిక్కిలి శ్రేయస్కర మని వాదించెను. కాని సెనేటు సభ వారీ ప్రతిపాదన నంగీకరింపలేదు. తాను వాగ్దానము చేసిన ప్రకారము రెగులస్ కార్థేజ నగరమునకు మరల వచ్చి బందీగ మరణించెను. రెగులస్ పరాజయముతరువాత రోమనుల సేనలు కార్థేజి సైన్యములతో పోరజాలక వెనుకకు మరలిపోయెను.

ఈ విజయము వలన కార్థేజి వారికి ధైర్యము హెచ్చి సిసిలీ ద్వీపమును కూడ ఆక్రమింప వలెనని అందు తమ సేనలను దింపిరి. క్రీ. పూ. 250 వ సంవత్సరమున రోమనులకును కార్థేజి వారికిని పెలార్మో అను ప్రదేశమున గొప్ప యుద్ధము సంభవింపగా అందు రోమనులకు విజయము కల్గెను. కాని

మరుసటి సంవత్సరమున కార్థేజి సేనలు తిరిగి ప్రతి స్పర్థుల నోడించెను. ఈ విధమున జయాపజయములు చక్రనేమి క్రమమున ఒకప్పుడొక పక్షము వారిని వేరొకప్పుడు మరియొక రినివరింపసాగెను. ఈ యుద్ధము నందీ సందర్భమున హామిల్కార్ అను సమర్థుడైన సేనాని కార్థేజి సేనలకు నాయకత్వము వహించెను. ఆతని యాజమాన్యమున కార్థేజి వారు రోమను లనేక యుద్ధములలో నోడించిరి. సిసిలీ ద్వీప మంతయు కార్థేజి వారి వశము కాబోవు చున్నట్లు కాన్పించెను. రోము నగరమున కోశాగారము నిర్ధన మయ్యెను. అయినను వారధైర్య పడలేదు. రోమను ప్రజలే ధనమును సేకరించి 200 ఓడవలను, 60,000 సైన్యమును సిద్ధపరచుకొని, ప్రమత్తులై యున్న కార్థేజి వారిపై బడిరి. ఈపర్యాయము జయలక్ష్మి రోమనులను వరించెను. (క్రీ. పూ. 241). కార్థేజి సేనలు సంపూర్ణముగ పరాభవింప బడెను. ఈ మొదటి ప్యూనిక్ యుద్ధ మిరువదినాల్గు సంవత్సరముల నుండి నిరంతరాయముగ సాగుచున్నందున నిరుపక్షముల వారును మిక్కిలి అలసిపోయి సంధి చేసికొనిరి. సంధి షరతులు రోము రాజ్యమునకు మిక్కిలి అనుకూలముగ నుండెను. కార్థేజి వారు చిరకాలము నుండి ఆక్రమించుకొని యున్న సిసిలీ ద్వీపమును, తత్పరిసర ద్వీపములను వదలిపోవునట్లును, నష్ట పరిహారముగ వారు రోము ప్రభుత్వమువారి కొక పెద్ద మొత్తము నిచ్చునట్లును పరిష్కార మయ్యెను. (క్రీ. పూ. 241). యుద్ధము సాగు చున్న కాలమున రోమనులు సార్డినియా ద్వీపమును కూడ ఆక్రమించిరి.

-: కార్థేజి ప్రభుత్వము బలపడుట :-

మొదటి ప్యూనిక్ యుద్ధము సమాప్తమైన తరువాత కూడ హామిల్కారు సేనాని కార్థేజి రాజ్యమునకు సర్వసైన్యాధ్యక్షుడుగ వ్యవహరించెను. రోమను ప్రభుత్వముతో కావించుకొనిన సంధి తాత్కాలిక మైనదిగ ఆతడు భావింప సాగెను. రోమనులు తమకు లభించిన అనుకూలముల వలన శాశ్వతముగ సంతోషించి యూరకుండ రనియు, అనతి కాలములో వారాఫ్రికా ఖండముపై దండెత్తి కార్థేజి నగరమును జయించుటకై యత్నింతురనియు హామిల్కారు బాగుగా గుర్తించెను. కావున కార్థేజి ప్రభుత్వమును బలపరచి సైన్యమును బాగుగా వృద్ధి చేయుట మిక్కిలి ఆవశ్యకమని యాతడు నిశ్చయించెను. రోమనులు తమ వద్దినుండి జయించిన ప్రాంతముల మరల ఆక్రమించుట దుస్తరము. కావున స్పైను దేశమునందు నివాసము కల్పించుకొని క్రమక్రమముగ తామా వరకు పొందిన నష్టమును తొలగించుకొన వచ్చునని హామిల్కార్ పథకము వేసెను. సుమారు వేయి సంవత్సరముల నుండి ఫినీషియాజాతివారు స్పైను దేశమునందు వర్తక కేంద్రములను స్థాపించుకొని యుండిరి. కావున తామచ్చటికి పోయి నివాసముగ నున్నను రోమనుల కెట్టి యనుమానమును కలుగబోదని హామిల్కారు గ్రహించెను. అతడాఫ్రికా ఖండమునందు పర్యటనము చేయుచున్నట్లు నటించి ఒకనాడకస్మాత్తుగ తన సేనలతో జిబ్రాల్టరు జలసంధిని దాటి స్పైను దేశములోనికి పోయెను. (క్రీ. పూ. 236). అచ్చట హామిల్కారు కావించిన

పరాప్టును గూర్చిన వివరము లేవియు మనకు తెలియరావు. కాని అతడు తొమ్మిది సంవత్సరములపాటు స్పైను దేశమున నివసించి, అచ్చట కార్థేజివారి కొక వలస రాజ్యము నేర్పాటుకావించి, తన సేనల కగు వ్యయము నంతను స్వీయముగ భరించుటయేకాక, ప్రతి సంవత్సరమును అపార మగు ధనమును స్వదేశమునకు పంపసాగెను. ఆతని మరణా నంతరము (క్రీ. పూ. 228)హాస్డ్రూబాల్ అను నామము గల ఆతని యల్లుడు కూడ ఇదే నీతి నవలంబించి, ఎనిమిది సంవత్స రముల కాలము కష్టించి కార్థేజి జాతివారి కొక ధన ధాన్య సంపన్న మైన రాజ్యమును కల్పించి యిచ్చెను. కొంతకాలము వరకును రోమనులు కార్థేజివారి ప్రయత్నములను గమనింప లేదు. కాని వారు పొందుచున్న అఖండమగు నభివృద్ధిని చూచునరికి రోమనులకు కొంత అసూయ జన్మించెను. వారు స్పైను దేశము నందలి పరిస్థితులను కనుగొని రమ్మని కొందరు ఉద్యోగులను పంపిరి. రోము ప్రభుత్వము వారి కీయవలసిన నష్టపరిహారపు ధనమును కూడబెట్టుటకై తాము స్పైను దేశము నాక్రమించు కొనవలసి వచ్చిన దని కార్థేజివారు తెల్పిరి. ఈ యంశము రోము ప్రభుత్వమునకు నచ్చలేదు. ఎందులకైన మంచిదని నిశ్చయించి రోమనులు స్పైను దేశము నందు నివాసము నున్న గ్రీకు ప్రజలతో సంధి కావించు కొనిరి. (క్రీ. పూ. 220). ఈ గ్రీకులు సాగుంటమ్, ఎంపోరి అను రేవు పట్టణములలో నివాసముగ నుండిరి. కార్థేజివా రొక నిర్ణీత మగు సరిహద్దును దాటి ముందునకు రాకూడదని

రోమనులు నిర్ణయము కావించిరి. ఇంతలో హాస్డ్రూబాల్ కూడ మరణించెను. ఆతని యనంతరము హామిల్కారు పుత్రు డైన హానిబాల్ అను నాతడు కార్థేజిసేనలకు నాయకత్వము వహించెను. ఇతడు యుద్ధరంగము నందే పుట్టి పెరిగిన వాడని చెప్పినను తప్పులేదు. హానిబాల్ తన తండ్రి మరణించిన వెనుక హాస్డ్రూబాల్ యాజమాన్యమున నాశ్విక సైన్యమున కధికారిగ నుండి మిక్కిలి సామర్థ్యమును చూపెను. బావ మరణించిన వెనుక నాతడే కార్థేజి సేనలకు సర్వాధిపత్య మును వహించెను. చారిత్రకు లీతనిని అలెగ్జాండరు, సీజర్, నెపోలియన్ మున్నగు మహావీరులతో పోల్చి మిక్కిలి కొని యాడు చున్నారు.

-: రెండవ ప్యూనిక్ యుద్ధము :-

తన బలమును క్రమముగ వృద్ధి చేసికొని ఆపైన ఇటలీ దేశముపై దండెత్త వలెనని హామిల్కార్ తలంచి యుండెను. ఇటలీ దేశములోని చిన్న రాజ్యములు రోము వారి యాధిపత్యము నంగీకరించి యున్నందున వారి బలము వృద్ధి చెందిన దనియు, ఆ చిన్న రాజ్యముల సహాయము లేని నాడు రోమనుల ప్రభ క్షీణించుననియు ఆతడు నిర్ణయించెను. కాని ఇటలీ దేశముపై దండెత్తుటకై తగిన అంగ బలమును, అర్థబలమును హామిల్కారు సంపాదించలేక పోయెను. హాని బాల్ కార్థేజి సేనల కాధిపత్యము వహించునరికి ఆతని బలము అభివృద్ధి చెంది యుండెను. ఈతని వద్ద క్రమశిక్షణ చెందిన బలవత్తరమగు సేన సంసిద్ధముగ నుండెను. కావున

కాలయాపన మెంతమాత్రమును చేయక రోము రాజ్యముపై దండెత్తుటకు హానిబాల్ నిశ్చయించెను. ఆతనికి కావలసిన ధన సహాయము స్పైను రాజ్యము నుండి లభింపగలదు. స్పైను దేశమున రోమనులతో సంధి చేసికొనిన కొందరు గ్రీకులు కలరని మన మీవరకే తెలిసికొని యున్నాము. మొదట హానిబాల్ పై గ్రీకుల స్థావరమగు సాగుంటమ్ పట్టణమును ముట్టడించెను. గ్రీకు లెనిమిది నెలలపాటు ధైర్యముతో పోరాడి రోమనుల నుండి యెట్టి సహాయమును లభింపని కారణమున హానిబాలునకు వశపడిపోయిరి. ఆతడు రోమునగరముపై దండెత్తి నాడని రోము ప్రభుత్వము దృఢముగ విశ్వసించి యుండెను. కావున సాగుంటమ్ పట్టణము ఆక్రమించుటలో హానిబాల్ కార్థేజి ప్రభుత్వమువారి ఆజ్ఞల ననుసరించెనో, లేక స్వతంత్రముగనే వర్తించెనో తెలుప వలసిన దని రోమనులు కార్థేజి ప్రభుత్వమునకు వార్త నంపిరి. కాని అచ్చటి నుండి సంతుష్టికరమైన సమాధానము రానందున రోమనులు కార్థేజిపై యుద్ధమును ప్రకటించిరి. ఇదియే రెండవ ప్యూనిక్ యుద్ధము. (క్రీ. పూ. 218).

యుద్ధ ప్రారంభము నాటికి హానిబాల్ వద్ద 40,000 సుశిక్షితమగు సేన యుండెను. స్పైను రాజ్యమును, కార్థేజి పట్టణమును రక్షించుటకై నలుబదివేల సైనికులను విడిచి హానిబాల్ ఒక లక్ష సేనతో ఇటలీ దేశమును జయించుటకై బయలువెడలెను. సముద్రముపై ప్రయాణము చేసిన పక్షమున అనేక ఆపదలకు గురికావలసి వచ్చును కావున భూమిమార్గమునే అనుసరించుట కాతడు నిశ్చయించెను.

స్పెయిను దేశము నుండి ఇటలీని చేరుటకై పిరనీస్ పర్వతములను దాటి, దక్షిణ ఫ్రాన్సును ప్రవేశించి, ఆపైన దుర్లంఘ్యము లగు ఆల్ప్సు పర్వతములను లంఘింప వలయును. పిరనీస్ కొండలను చేరులోపలనే హానిబాల్ పలువురు ఆటవిక జాతు లతో పోరాడవలసి వచ్చినందున ఆతని సైన్యము కొంత క్షీణించెను. దూర దేశములకు పోవుటకై భయపడి ఆతని సైనికులలో కొందరు వెనుకకు మరలిపోయిరి. కావున 60,000 సేనతో హానిబాల్ ఫ్రాన్సు దేశమును ప్రవేశిం చెను. హానిబాల్ కావించుచున్న ప్రయత్నములను చూచు చుండియు రోమను లాతని పురోగమనమును నిరోధించుటకై చాలకాలము వరకును ఎట్టి యత్నమును చేయలేరు. తుదకు వారు సిపియో అను సేనానిని పంపి హానిబాల్ తో పోరాడ వలసినదని నియమించిరి. రోను నది వద్ద తన సేనల నిల్పి కార్థేజిసేన లా నదిని దాటకుండ నిరోధింప వలెనని సిపియో తలంచెను. కాని హానిబాల్ ఆతనిని తప్పించుకొని రోను నది ఆవలి యొడ్డునకు ససైన్యుడై క్షేమముగ చేరగల్గెను. ఆపైన హానిబాల్ మహోన్నతము లగు ఆల్ప్సు పర్వతముల గుండ తన సేనల నడపించెను. కార్థేజి సైనికులు ఆహ్లాదకర మైన స్పెయిను దేశపు శీతోష్ణస్థితికిని, ఆఫ్రికా ఖండపు భీకర గ్రీష్మమునకును అలవాటుపడినవారు. కాని ఎన్నడును పర్వ తము లందలి శీతల బాధను సహించినవారు కారు. అయినను హానిబాల్ మిక్కిలి నైపుణ్యముతో తన యుద్ధ సామగ్రిని, గుఱ్ఱములను, ఏనుగులను, పర్వతపు కనుమలలో నుండి నడపి అతికష్టముపై ఇటలీదేశమును ప్రవేశించెను. (క్రీ. పూ, 218).

హానిబాల్ కావించిన ఘనకార్యములలో చలికాలమునందు ఆల్ప్సు పర్వతములను దాటుట యొకటి. గత శతాబ్దమందు నెపోలియన్ ధీరుడు కూడ ఇట్టి సాహసకార్యమునే కావించి ప్రఖ్యాతి గాంచెను. దుస్తరమైన యీ ప్రయాణము వలన కార్థేజి సైనికులు మిక్కిలి అలసిపోయి యుద్ధమున కసమర్థులై యుండిరి. ఫ్రాన్సు దేశమును ప్రవేశించిన అరువది వేల కార్థేజి సేన యందు సగము నశించెను. హానిబాల్ వద్ద 30,000 సైనికులు మాత్ర ముండిరి.

-: హానిబాల్ విజయములు :-

కార్థేజి సేనల బలహీనతను గుర్తించి రోమనులు తత్క్షణమే హానిబాల్‌ను తాకుటకై తమ సైన్యములను పంపిన పక్షమున వారికి జయము లభించి యుండెడిది. కాని వారట్లు చేయలేదు. హానిబాల్‌కు కూడ పరిస్థితులు విశేష మనుకూలముగ పరిణమింపలేదు. ఆల్ప్సు పర్వతములకు సమీపమున నివసించు అనాగరక ప్రజలు తనకు సహాయ పడుదురేమోయని ఆతడు మిక్కిలి ఆశపడెను. కాని వారట్లు చేయలేదు. ఇది యిట్లుండగా సిపియో అను రోమను సేనాని హానిబాల్‌పై తన సేనల నడపి పరాభవమునందెను. (క్రీ.పూ.218). అనతికాలములో సెంప్రోనియస్ అను మరియొక రోమను సైన్యాధ్యక్షుడు 40,000 సేనతో సిపియోకు సహాయముగా వచ్చెను. ట్రిబియా యను నది యొడ్డున ఇరుపక్షముల వారికిని పోరాటము సంభవించెను. హానిబాల్ తన సేనల నేవిధముగను అలసిపోకుండ కాపాడి రోమనులు నదిని దాటి

యుద్ధమునకు పూనుకొన్నట్లు ఎత్తు వేసెను. రోమను సేన లాతని వలలో చిక్కుకొని జలప్రపూర్ణమగు ట్రిబియా నదిని దాటిరి. తక్షణమే కార్థేజి సేనలు వారిని దాకి సంపూర్ణముగ నోడించెను. సుమారు ముప్పదివేల మంది రోమనులు యుద్ధమున మడియుటయో, లేక శత్రువులకు బందీగ చిక్కుటయో సంభవించెను. ఈ విజయము వలన హానిబాల్ కీర్తి నలు దెసల వ్యాపించెను. రోమను ప్రభుత్వమునకు విరోధులైన "కెల్టులు" అను అనాగరక జాతివారు 60,000 సేనతో హానిబాల్ కు సహాయపడిరి.

హానిబాల్ విజయమువలన కూడ రోముప్రభుత్వము వారికెట్టి తొందరయు కలుగలేదు. ఆతనిశక్తి సామర్థ్యము లింకను రోమనులకు తెలియరానందున తమకెట్టి అపాయ మునులేదని వారు తలంపసాగిరి, కాని అతడు అపినైన్ పర్వతములదాటి దక్షిణ ఇటలీలో ప్రవేశింప కుండుటకై వారు రెండు సేనలను పంపిరి. దక్షిణ ఇటలీలోనికి వచ్చుటకై అవ లంభింప వలసిన రెండు రాజమార్గములను ఈసేనలు కాపాడ సాగెను. హానిబాల్ చలికాలమంతయు ఉత్తరమున గడపి వసంతము ప్రారంభింపగనే దక్షిణాభిముఖముగ తన సేనల నడపసాగెను. కాని రోమనుల సేనలచే రక్షింప బడుచున్న రాజమార్గముల విడచి వేరొక త్రోవ ననుసరించి ఆతడు దక్షిణ ఇటలీలో ప్రవేశించెను. ఈ ప్రయాణమునందు కార్థేజి సైనికులు పలువురు మరణించిరి. హానిబాల్ కు ఒకకన్ను చెడి పోయెను. కాని ఆతడు తాను సాధింపదలచిన కార్యమును

సాధించితీరెను. హానిబాల్ తమ్ము తప్పించుకొని దక్షిణ ఇటలీయందు ప్రవేశించుటవలన రోమను సేనాధిపుల కుతుకట బోతు దనమును ఆగ్రహమును, కలిగెను. వీరిలో ఫ్లామిని యస్ అను సేనాని హానిబాల్ ను తరుముచువచ్చి ట్రాసిమెన్ అను సరస్సుసమీపమున కార్థేజిసేనలకు దాకి సంపూర్ణముగ పరాభవింపబడెను. 6000 సైనికులు మాత్ర మతి కష్టముపై తప్పించుకొని పోయిరి. (క్రీ-పూ- 217). ఈ విధముగ ఎట్రూరియా అను రాష్ట్రము హానిబాల్ వశమయ్యెను. ఆతడు తలుచుకొనిన యెడల రోమపట్టణముపై దాడి వెడ లుట కాతని కెట్టి యవరోధమునులేదు. కాని హానిబాలందు లకు పూనుకొనలేదు. అతడు తన సేనలకు సంపూర్ణమైన విశ్రాంతి యొసంగెను. ఈ విజయములవలన హానిబాల్ కు అపారమైన ధనమును వస్తుసామగ్రియు లభించినందున అతడు తన సైన్య వ్యవస్థను చక్కపరచి, సేనను బలపరచెను. కాని ఆతడుతలంచినట్లు ఇటలీదేశము లోని చిన్నచిన్న రాజ్యముల వారెవ్వరును ఆతనికి సహాయపడనందున హానిబాల్ కు గొప్ప ఆశాభంగము కల్గెను.

అన్ని ప్రదేశములందును తమ కపజయమే సంభవించు చున్నందున రోమనులకు భయము కలుగసాగెను. వారు వృద్ధుడును, అనుభవశాలియు నగు ఫేబియస్ అను సేనానిని కార్థేజియోధులతో పోరాడుటకై పంపిరి. ఈతడు హాని బాల్ తో ఎదురుపడి యుద్ధము చేయుట కెంత మాత్రముసు సిద్ధపడక, ఆతని వస్తుసామగ్రుల దోచుకొనియు, ఒంటరిగ

కానవచ్చిన సైనికులను చంపియు, విసిగింపసాగెను. శత్రుబల మును క్రమక్రమముగ క్షీణింపజేసి తుదకాతని నోడించుట ఈ విధానమందలి లక్ష్యము. ఈనీతి నేటికిని "ఫేబియన్ నీతి" అను పేరిట వ్యవహరింపబడుచున్నది. కాని ఫేబియస్ అవ లంబించిన మార్గము రోమను ప్రభుత్వమువారి కంగీకారము కాలేదు. హానిబాల్ ను శీఘ్రముగా నోడించి తరిమివేయ వల యునను ఆవేశముతో వారు 90,000 సైన్యమును సిద్ధపరచి పంపిరి. అప్పటికి హానిబాల్ కానే అను దుర్గము నాక్రమిం చుకొనెను. కావున ఉభయపక్షముల వారును ఆ దుర్గ సమీప మున యుద్ధసన్నద్ధులైరి. (క్రీ-పూ- 216). రోమను లొకరి వెనుక నొకరు దీర్ఘమైన పంక్తులదీర్చి పోరాటమునకు తలపడిరి. హానిబాల్ తన సేనల నర్ధచంద్రాకారముగ నిలువ బెట్టెను. వారి సేనాముఖమున ఆటవిక ప్రజలు యుద్ధరంగమున నిలిచిరి. మొదట రోమను సైనికులు ధైర్యముతో పోరాడి ఆటవికుల చీకాకుపరచి కార్థేజ సేనలోనికి జొరబడిరి. కాని యుద్ధక్రమము నతి శ్రద్ధగ పరిశీలించుచున్న హానిబాల్ తన అశ్వికసైన్యమునుపంపి శత్రువుల జుట్టుముట్టున ట్లాజ్ఞాపించెను. రోమనుల గుఱ్ఱపు దళము కార్థేజివారి ధాక తాళజాలక పలాయన మయ్యెను. కార్థేజి సేనలు రోమనులను చుట్టు ముట్టెను. రోమనులకు తమ ఆయుధముల నుపయోగించుటకు కూడ అవకాశము లేక ఎచ్చటివారచ్చట శత్రువుల ఖడ్గముల కెరయైరి. సేనానాయకులును, సమర్థులైన పలువురు ఉద్యోగు లును, సుమారు 70,000 రోమను సైనికులును కానే రణ రంగమున కూలినట్లు అంచనా వేయబడినది. ఈ విజయము

రోమక ప్రభుత్వమును కూకటి వ్రేళ్ళతో కదలించి వైచి రోమను ప్రజలకు భీతాహము కలిగించెను. యుద్ధము చేయ గల రోమను ప్రజలలో నేడవ వంతువా రీ రణభూమియందు ప్రాణములను కోల్పోయిరి. ప్రతిగృహమునందును అధమపక్ష మొకవ్యక్తియైన ఈ సమరాంగణమునకు బలి యయ్యెను. రోము పట్టణము శత్రువులచే నాక్రమింపబడు పరిస్థితులు లేర్ప డెను. అట్లు చేయవలసినదని హానిబాల్ సహాయకులు కొందఱ రాతనికి సలహానిచ్చిరి. రోమునగరము నాక్రమించు కొనిన పక్షమున తమకిష్టమైన సంధి షరతులను వారిచే (రోమనులచే) అంగీకరింప చేయవచ్చునని కార్థేజిసేనా నాయకులు కొందరు తలంచిరి.

కాని హానిబాల్ రోము నగరముపై దండెత్త లేదు. ఆతడట్లు కావించిన పక్షమునను, అదృష్టదేవత యాతనిని వరించినపక్షమునను రోమునగర మాతనికి స్వాధీనమైయుండ నోపును. అయినను సులభముగ శత్రు హస్తగత మగుటకు రోముపట్టణ మంత బలహీనమైనది కాదు. ఆనగరము చుట్టును బలవత్తర మగు ప్రాకారమును, అగాధ మగు పరిఖయును నుండెను. కానే పరాభవముతరువాత రోమనులు తొందరపడ్డి నగర సంరక్షణమునకై అనేకములగు నితర ప్రయత్నములను కావించిరి. గడచిన యుద్ధములలో రోమను సైనికు లనేకులు మరణించినను, వారికంటె నధిక సంఖ్యాకులు దేశ రక్షణ మునకై నడుముకట్టి నిలచిరి. దేశమునకు ప్రమాదము సంభ వించినందున రోము పట్టణమందలి ప్రజలు తమపూర్వ వైర

ములనుమరచి యొకే త్రాటిపై నడవసాగిరి. కార్థేజివారిపై ప్రతీకార కాంక్ష, వారి మైకమత్యము నినుమడించెను. ఇట్టి పరిస్థితియందు రోముపట్టణము నాక్రమించుట కష్టసాధ్యమని యు, నెలల తరబడి పట్టణము ముట్టడించిన కాని రోమునగ రము తమకు స్వాధీన పడదనియు, అట్టి తీవ్ర ప్రయత్నమును కావించుటకై తనసేన లసమర్థములనియు హానిబాల్ చక్కగ గ్రహించియే ఆయత్నమును చేయలేదు. అంతేకాక కార్థేజి సేనలొంటరిగ రోముప్రభుత్వము నోడింపజాలవని హానిబాల్ బాగుగా నెరుంగును. కావుననే ఆతడు ఇటలీ దేశమందలి యితర చిన్న ప్రభుత్వముల వారిని తనతో చేరవలసిన దని అనేక విధముల ప్రోత్సహించెను. కొందరు హానిబాల్ కోర్కెను మన్నించి అతని పక్షము నవలంబించిరి. ఈ విధ ముగ ముప్పదివేల సైనికులు కార్థేజిసేనలకు సహాయముగ చేరిరి. కాని దక్షిణ ఇటలీయందలి గ్రీకులును, తదితరులును కూడ అచంచల దీక్షతో రోమను ప్రభుత్వము పక్షము నవలంబించిరి.

హానిబాల్ తాను నిర్ణయించుకొనిన ప్రకారము ఇటలీ దేశమునంతను జయించి రోమునగరము స్వాధీన పరచు కొనజాలక పోవుటకు వేరొక బలవత్తర మగు కారణ ముండెను. కార్థేజినగరమునుండి కాని, దానికి వలసరాజ్యముగ నున్న స్పైను దేశము నుండి కాని తనకు సంపూర్ణ సహాయము లభించునని అతడాశపడెను. కాని హానిబాల్ కీ విషయమున కూడ గొప్ప ఆశాభంగము కల్గెను. స్పైను దేశము నుండి బయలుదేరి వచ్చునప్పు డాతడు తన సోదరుడగు హాస్డ్రూ)

బాల్‌ను తనకు ప్రతినిధిగ అచ్చట నిల్పివచ్చెను. హాస్డ్రూబాల్ తన అన్నయెడ మిక్కిలి భక్తి, విశ్వాసములతో వర్తించెను. తనకు సాధ్యమైన పక్షమున నాతడు హానిబాల్ కావించుచున్న మహత్తర కార్యమున కన్నివిధముల చేయూత నొసంగెడి వాడే. కాని రెండవ ప్యూనిక్ యుద్ధము ప్రారంభము కాగానే రోమను ప్రభుత్వము వారు స్పెయినుదేశము నాక్రమించుకొనుటకై యొకబలవత్తరమగు సేనను పంపిరి. ఆసేన హాస్డ్రూబాల్ నోడించి, అతడు తన సోదరున కెట్టి సహాయమును పంపకుండ అరికట్టి వైచెను. కార్థేజి యందలి కేంద్రప్రభుత్వము వారు తలంచుకొనిన యెడల ఆతనికి సహాయక సేనను పంపి యుందురు. కాని రాజకీయ వైరము వలనను, అసూయవలనను వారట్లు చేయలేదు. సిసిలీ ద్వీపమును పునః జయించుటకై తమ సేనలోని అధిక భాగమును వినియోగించి, 4000 సైనికులుగల స్వల్పభాగమును మాత్రము హానిబాల్‌కు సహాయముగ ఇటలీకి పంపిరి. దీనివలన ఆతడు పూనిన ఘనకార్య మేవిధముగను ముందంజ వేయజాలక పోయెను. పరిస్థితులు తన కన్నివిధముల అననుకూలముగ నున్నను హానిబాల్ పదమూడు సంవత్సరముల కాలము ఇటలీదేశమునం దజేయుడుగ నుండగల్గెను. కాని తుదకాతని మనోరథము లన్నియు భగ్నమయ్యెను.

అపారమగు జన నష్టములకును, అవమానకరమైన పరాజయములకును లోనగుటవలన రోమనుల సేనలు మిక్కిలి జాగరూకతతోడను, దూరదృష్టితోడను యుద్ధమును సాగింప జొచ్చెను. కావున హానిబాల్ ఆపైన మరే విజయ పరంపర

లను సాధింప జాలడయ్యెను. రోమనులు హానిబాల్‌తో యుద్ధమున కెన్నడును తలపడలేదు. తన కడనున్న సేన పరిమితమైనందున హానిబాల్ తనశత్రువులను దాకుటకు సాహసింపలేదు. ఆతడు మ్యాసిడోనియా రాజగు ఫిలిప్పును, సిసిలీ ద్వీపపు రాజును తనకు సహాయము చేయవలసిన దనికోరెను. కాని దానివలన నెట్టి ఫలితమును కలుగలేదు. రోమను ప్రభుత్వము వారు స్పైను దేశమునుండి కార్థేజివారిని తరిమివేయవలెనని విశ్వప్రయత్నములు చేయుచునేయుండిరి. ఒకప్పుడు కార్థేజి సేనలును, మరొకప్పుడు రోమను సేనలును విజయమును సాధించుచుండెడివి. తుదకు రోమనులు కార్నీలియస్ సిపియో అను మిక్కిలి సమర్థుడైన సేనానిని స్పైను దేశమునకు పంపిరి. ఆతడు కార్థేజివారిచే నాక్రమింపబడిన ప్రాంతమును చాలవరకు జయించుటయేకాక వారికి చెందిన అపారమైన యుద్ధసామగ్రిని వశపరచుకొనెను. (క్రీ. పూ. 209). కాని హానిబాల్ సోదరుడైన హాస్డ్రూబాల్ తన అన్న కెట్లయిన సహాయము చేయవలయునని నిశ్చయించి క్రీ. పూ. 208.వ సంవత్సరమున నొక సైన్యమును సిద్ధపరచి ఇటలీ దేశమును చేరుటకై బయలు వెడలెను. రోమను సేనానియగు కార్నీలియస్ సిపియో ఈతనిని నిరోధించుటకై యత్నించియు కృతకృత్యుడు కాజాలకపోయెను. హాస్డ్రూబాల్ పిరనీస్ కొండలను, ఆల్ఫ్సు పర్వతములను దాటి ఇటలీ దేశమును ప్రవేశించెను. అప్పటికే హానిబాల్ బలము మిక్కిలి క్షీణించియుండెను. ఆతనికడ ఇరువదివేల సైన్యము మాత్రము నిలిచియుండెను. రోమనులు క్రమక్రమముగ హానిబాల్ ఆక్రమిం

చిన దుర్గములను వశపరచుకొన సాగిరి. హాస్డ్రూబాల్ ఇటలీ దేశమును ప్రవేశించుట తెలిసికొని ఆతని సోకడల గమనించుటకై విలియస్ అను సేనానిని నియమించిరి. ఇటలీ దేశమును ప్రవేశించిన వెనుక హాస్డ్రూబాల్ తన యన్నకొక లేఖను వ్రాసి తన్నొక ప్రదేశమున కలిసికొన వలయునని కోరెను. మరదృష్టవశమున నాలేఖ రోమనుల చేతిక్కెను. వారు నిర్ణీత కాలమున హాస్డ్రూబాల్ తెల్పిన ప్రదేశమునకు వీరులైన ఎనిమిది వేల రోమను సైనికుల వెంటబెట్టుకొని ఆతనిని చెరబట్టి, శిరచ్ఛేదము చేసి, ఆ తలను హానిబాల్ కు పంపిరి. అత్యంత సమర్థుడగు సోదరుడు మరణించినందున హానిబాల్ మిక్కిలి దుఃఖించెను. ఇటలీ దేశమున నిక తాను నిలువగల్గుట సాధ్యము కాదని నిశ్చయించి ఆతడు అచ్చటి నుండి వెడలిపోవుటకు ప్రయత్నములు చేయసాగెను.

హాస్డ్రూబాల్ మరణము హానిబాల్ పతనమునకును, రెండవ ప్యూనిక్ యుద్ధము నందు కార్థేజ్ వారి సంపూర్ణ పరాజయమునకును కారణ మయ్యెను. హాస్డ్రూబాల్ మరణించిన వెనుక స్పైను దేశము నుండి కార్థేజ్ సేనలు సులభముగ తరిమివేయబడెను. రోమను సేనానులలో అత్యంత సమర్థుడగు కార్నీలియస్ సిపియో స్పైను నుండి స్వదేశమునకు మరలివచ్చి ఆఫ్రికా ఖండముపై దండెత్తి కార్థేజి ప్రభుత్వము నోడించుటకై సన్నాహము చేయ నారంభించెను. ఇప్పటికి కార్థేజి ప్రభుత్వము వారు కండ్లు తెరచి హానిబాల్ కు సహాయము నంపవలెనని యత్నించిరి. కాని దానివలన హానిబాల్ కెట్టి లాభమును కలుగలేదు. రోమను

సేనాని సిపియో ముప్పది వేల సేనతో ఆఫ్రికా ఖండములో దిగెను. (క్రీ. పూ. 203). ప్రథమమున నాతనికి కొన్ని కష్టము లెదుర్కొనినను తుదకు సిపియో కార్థేజి సేనల నోడింప గల్గెను. కార్థేజి నగర మందు శాంతి కనుకూలు రగు పక్షము వారు బలపడిరి. సిపియో కూడ సంధి చేసికొన వలయునని యత్నించి కార్థేజి వారికి మిక్కిలి అనుకూలమైన షరతులను మాత్రము విధించెను. కాని మనసు నిలుకడలేని కార్థేజి పక్షము వారు ఇటలీ నుండి హానిబాల్ ను వెనుకకు పిలిపించి మరల యుద్ధమునకు పూనుకొనిరి. ముప్పదియారు సంవత్సరములు విదేశములలో యుద్ధమును కావించుచుగడపి తుదకా వీరుడు స్వదేశమునకు మరలివచ్చెను. హానిబాల్ కొంత కాలము వరకును వేచియుండి తన పక్షమును బలపరచు కొనుటకై యత్నించెను. తుదకు క్రీ. పూ. 202 వ సంవత్సరమున హానిబాల్ సేనలును, సిపియో సేనలును జామా యను ప్రదేశమున తారసిల్లెను. అచ్చట భయంకరమైన యుద్ధము ప్రవర్తిల్లెను. కార్థేజి సైనికులలో పలువురు క్రమశిక్షణ కాని, యుద్ధానుభవము కాని లేనివారు. అందువలన హానిబాల్ పూర్వ సైనికు లెంత ధైర్యసాహసములు ప్రదర్శించినను ఫలితము లేకపోయెను. రోమనులకు సంపూర్ణ విజయమును, కార్థేజి సేనలకు సంపూర్ణ పరాభవమును కల్గెను. హానిబాల్ దూరప్రాంతములకు పారిపోయెను. సిపియోకు ఆఫ్రికా ఖండమునం దాతడు సాధించిన మహత్తర విజయమునకు చిహ్నముగా సిపియో "ఆఫ్రికానస్" అను బిరుదనామము లభించెను.

క్రీ. పూ. 201. వ సంవత్సరమున కార్థేజి వారికిని రోమనులకును సంధి కుదిరెను. ఈ సంధి షరతుల ననుసరించి కార్థేజివారు స్పైను దేశము పైనను, మధ్యధరాసముద్రము నందలి దీవుల పైనను తమకుగల హక్కును సంపూర్ణముగ వదలుకొనిరి. యుద్ధకాలమునందు రోమనులకు సహాయపడిన మెస్సినిస్సా అను ఆఫ్రికాసేనానిని న్యూమిడియా రాజ్యము నకు ప్రభువుగ కార్థేజివా రంగీకరించిరి. ఈతనితో రోము ప్రభుత్వమువారి యనుమతి లేకుండ కార్థేజివారు యుద్ధము ప్రకటించుటకు వీలులేదు. నష్టపరిహారముగ రోము ప్రభుత్వ మున కొక గొప్ప ధనపు మొత్తము ముట్టవలయును. రెండవ ప్యూనిక్ యుద్ధ మీ విధముగ సమాప్త మయ్యెను. దీనివలన కార్థేజి ప్రభుత్వము తన సామ్రాజ్యము లెల్ల కోల్పోయి ఒక నగర రాజ్యముగ నిల్చిపోయెను.

హామిల్కార్ కాని ఆతని కుమారుడగు హానిబాల్ కాని రోము రాజ్యమును సంపూర్ణముగ నాశనము చేయవలె నని ఉద్దేశించినవారు కారు. నాల్గు నూర్ల సంవత్సరములు నుండి నిరంతరాయముగ తాము నివసించుచున్న సిసిలీ ద్వీపము నుండి రోము ప్రభుత్వము వారు తమ్ము వెడల నడచుట వలనను, వారి సామ్రాజ్య కాంక్ష దినదినమును హెచ్చి పోవుచున్నందునను కార్థేజ ప్రభుత్వము రోము నగరముపై కత్తి దూసెను. రోమనుల గర్వభంగము కావించి, వారు తమ రాజ్యాంగ విషయములలో జోక్యము కలుగ జేసికొన కుండునట్లు చేయుటయు, వారి సామ్రాజ్య కాంక్ష హద్దులు మీరకుండ జేయుటయును హానిబాల్ లక్ష్యము. కాని మన

దృష్టవశమున నాతని కీ ప్రయత్నమునందు జయము సిద్ధింపలేదు. ఈ విజయముల వలన రోము ప్రభుత్వమువారి గర్వ మినుమడించి వారి నైతిక పతనము ప్రారంభించె నని చారిత్రకులు తలంచుచున్నారు.

రెండవ ప్యూనిక్ యుద్ధము సమాప్తమైన తర్వాత కొంతకాలము హానిబాల్ కార్థేజి నగరమునం దవ్యాహతముగ పరిపాలనము కావించెను. రాజ్యాంగమునం దానాడు నెలకొనియున్న అనేక లోపములను సవరించి, ఆతడు నూతన పద్ధతులను ప్రవేశపెట్టెను. కార్థేజి రాజ్యాంగసభ యం దెన్నికల కావించి నూతన సభ్యులను నియమించెను. ఆర్థిక విషయములం దాతడు కావించిన మార్పుల వలన కార్థేజి రాజ్యమత్యంత ధనసంపన్నమై రోము ప్రభుత్వమున కీయవలసిన నష్టపరిహారపు సొమ్మును సులభముగ తీర్చివై చెను. కాని కార్థేజి యందలి కొందరు స్వలాభపరులకు హానిబాల్ కావించిన మార్పు లంగీకారము కాలేదు. కావున వారాతనిపై ద్వేషము పూని హానిబాల్ రోము ప్రభుత్వముపై యుద్ధ ప్రకటనము కావించుటకై యత్నించుచున్నాడని వర్తమాన మంపిరి. హానిబాల్ ను తమకు వశపరచ వలసినదని రోము ప్రభుత్వము కార్థేజి వారి నాజ్ఞాపించెను. ఆత్మరక్షణమున కెట్టి ఉపాయమును లేనందున హానిబాల్ టైరు నగరమునకు పారిపోయెను. అచ్చటి నుండి వెడలి కొంతకాలమాతడు సిరియా దేశపు రాజగు ఆంటియోకస్ కొలువునందు నివసించెను. తుదకు రోమనులు సిరియా దేశమును జయింపగా నాతడు శత్రువులకు బందీగ చిక్కుట కిష్టములేక విష

పానము చేసి ప్రాణములను విడచెను. మహావీరుడైన హానిబాల్ ఈ విధమున తన అరువది నాల్గవయేట (క్రీ.పూ. 183) నిస్సహాయుడై పరదేశమున మరణింప వలసివచ్చెను. యుద్ధరంగమున నాతని నోడించిన సిపియో ఆఫ్రికానస్ అను రోమను వీరుడు కూడ అదే సంవత్సరమున మరణించుట గమనింప దగియున్నది.

**-: మూడవ ప్యూనిక్ యుద్ధము - కార్థేజినగర వినాశము :-**

కార్థేజి రాజ్యము వారు యుద్ధమున పరాభవ మొందినను వారి వైశ్వర్యమును, ప్రాభవమును ఏవిధముగను నశింపలేదు. ఏలయన వారు పరదేశములతో తమ వ్యాపారమును యథాప్రకారము సాగించుచుండిరి. రోమనులు కార్థేజిపై పగబట్టి ఆ పట్టణమును నాశనము చేయని పక్షమున కార్థేజి నగరము అఖండైశ్వర్యములతో చిరకాలము నిలచి, వర్తక కేంద్రముగ వర్ధిల్లు చుండెడిది. కాని దైవ మన్యథా నిర్ణయించి యుండెను. రెండవ ప్యూనిక్ యుద్ధము ముగిసిన తర్వాత రోమనులును, కార్థేజి వారును కావించుకొనిన సంధియం దొక ప్రమాదకర మగు షరతు చేర్పబడెను. రోము ప్రభుత్వము వారి యనుమతి లేకుండ కార్థేజి వారు ఎవ్వరితోడను యుద్ధము చేయరాదని అందు తెల్పబడి యుండెను. మెస్సీనిస్సా అను ఆఫ్రికా రాజు కార్థేజి పట్టణమునకు సమీపముననే రాజ్య పాలనము చేయు చుండెను. కార్థేజి ప్రజలపైవిధింపబడిన నిర్బంధములను తెలిసి

కొని ఆతడు తరచు వారి రాజ్యముపై దాడి సల్పుచు, వారి రాజ్యములో కొన్ని భాగములను స్వాధీనపరచుకొనసాగెను. ఈ విషయమును గూర్చి కార్థేజి వారు రోము ప్రభుత్వమున కెన్ని పర్యాయములు మొరపెట్టుకొనినను వారేమియు లక్ష్యము చేయలేదు. కాని తుదకు సెనేటు సభ వారు కేటో అను సెనేటు సభ్యుని కార్థేజి నగరమునకు పంపి, అచ్చట జరుగుచున్న వివాదముల పరిష్కారము కావించి రమ్మని నియమించిరి. కేటో మిక్కిలి దుష్టుడు, అసహనము గల వాడు. యుద్ధమునం దోడినను కార్థేజి నగరము సకలైశ్వర్య సంపన్నమై వర్ధిల్లుచుండుట ఆతనికి అసూయ కల్గించెను. కావున ఆ పట్టణము నైల్లైన నాశనము చేయవలయునని ఆతడు సంకల్పించుకొని అప్పటి నుండియు కార్థేజికి విరుద్ధముగ ప్రచారము సాగింప మొదలిడెను. ఏ యంశమును గూర్చి ప్రసంగించినను తుదకు "కార్థేజి నగరమును నాశనము చేయవలయునని కూడ మిమ్మలను హెచ్చరించుచున్నాను" అని కేటో రోమనులకు బోధింపసాగెను. ఈ నడుమ కాలమున మెస్సినిస్సా ఆగడములు దుర్భరమైనందున కార్థేజి ప్రభుత్వ మాతనిపై యుద్ధము ప్రకటించెను. ఈవిధముగ సంధి షరతులకు భంగము కల్గెను. కార్థేజి నగరమును నాశనము చేయవలయునని నిశ్చయించుకొని యున్న రోము ప్రభుత్వమునకు తగిన యదను లభించెను. యుద్ధము కావించుట తమ కెట్లు తప్పనిసరి యయ్యెనో రోము ప్రభుత్వమునకు సవిస్తరముగ తెల్పుటకై కార్థేజి ప్రభుత్వమొక రాయబార సంఘమును పంపెను. కాని కేటో

దుష్ప్రచారము రోమనుల మనస్సులందు విషబీజముల నాటి యున్నందున నీ రాయబారము విఫలమయ్యెను. (క్రీ.పూ.151) రోమను ప్రభుత్వము సేనలను సిద్ధపరచి యోడలలో పంపు వరకును కార్థేజి ప్రభుత్వము యుద్ధము ప్రారంభ మైనదని గుర్తింపలేదు. ఎట్టి యవమానమునకును వెనుదీయక రోము ప్రభుత్వముతో సంధి కావించుకొన వలయునని వారు ప్రాకు లాడిరి. మూడునూర్ల మంది కార్థేజి ప్రజలను తమ వద్ద శాశ్వత ఖైదీలుగ పంపిన పక్షమునను, రోమను కాన్సలులు (పరిపాలకులు) విధించు ఇతర షరతుల నంగీకరించిన పక్షము నను, తాము కార్థేజి నగరమును, ప్రజలను, వారి ఆస్తిని రక్షించెద మని సెనేటు సభ వారు వాగ్దానము చేయగా కార్థేజి నగరమువారా ప్రతిపాదన నంగీకరించిరి. మున్నూ గ్గురు శాశ్వత ఖైదీలు రోము నగరమునకు పంపబడిరి. అంతట రోమను ప్రభుత్వోద్యోగులు కార్థేజి నగరమందు గల ఆయు ధము లన్నియు తమకు వశపరచ వలసినదని ఆజ్ఞాపించిరి. ఎట్టి దూరాలోచనయు లేకుండ కార్థేజి ప్రజలీషరతును కూడ పాలించి నిస్సహాయులై నిలువబడిరి. అంతట రోమనులు కార్థేజి నగరమును ప్రవేశించి తాము పట్టణమును నాశనము చేయుటకు నిశ్చయించితి మనియు, కావున అచ్చటి ప్రజ లందరును వెడలిపోయి సముద్రతీరమునకు పది మైళ్ళ దూర మున నున్న మరే ప్రదేశమున నైన నివాస మేర్పరచుకొన వచ్చుననియు ప్రకటించిరి. రోమనుల నిజమైన ఉద్దేశ్యము లిప్పటికి కారేజి వారు గ్రహింప గల్గిరి. కావున ప్రాణ ముల నైన ధారపోసి తమ రాజధానీ నగరమును కాపాడు

కొనవలయునని వారు కృతనిశ్చయులైరి. రోమనులతో సంప్రతింపులు జరిగించుచున్నట్లు నటించుచు వారు కాలయాపనము చేయసాగిరి. రాత్రిం దివములు కష్టించి పురుషులు, స్త్రీలు, బాల బాలికలును కూడ ఆయుధముల సిద్ధపరచుకొనసాగిరి. రోమను ప్రభుత్వము వారి ఉద్యోగులు నగరము స్వాధీన పరచుకొను నుద్దేశ్యముతో వచ్చుసరికి వారికి కోట బురుజులపై సాయుధులును, యుద్ధసన్నద్ధులు నగు కార్థేజి సైనికులు కాన్పించిరి. కార్థేజి నగర మెత్తైన ప్రదేశముపై నిర్మింపబడినది. పట్టణమునకు మూడు ప్రక్కల సముద్రము గలదు. మిగిలిన యొక వైపున బలమైన కోటగోడ నిర్మింపబడి యుండెను. అంతేకాక కార్థేజి వారి యధీన మందున్న ఇతర ప్రాంతములలో సేనలు సంసిద్ధముగ నుండెను, కావున రోమనులకు కార్థేజ నగరమును స్వాధీనపరచుకొనుట మిక్కిలి కష్టసాధ్య మయ్యెను. కావున వారు కావించిన మొదటి ప్రయత్నములు నిరర్థకము లయ్యెను.

తుదకు రోమను ప్రభుత్వము వారు సిపియో ఆఫ్రికానస్ వీరుని దత్తపుత్రుని సైన్యాధికారిగ నియమించి యుద్ధమును తీవ్రముగ సాగింప వలసిన దని యాజ్ఞాపించిరి. ఆతడు తన సేనను బలపరచి క్రమశిక్షణను నెలకొల్పి రణమును చేయసాగెను. పట్టణమునకు వెలుపల నివసించు ధనాధికులందరును, అపాయ పరిస్థితు లేర్పడిన వని తెలిసికొని కోట లోనికి పోయి దాగుకొనిరి. సిపియో కార్థేజి నగరపు రేవు నడ్డగించి ఓడలు వెలుపలికి పోవుటకును, లోనికి వచ్చుట

కును వీలుకాకుండ నవరోధించెను. కాని కార్ధేజ పౌరు లద్భుత మగు పట్టుదలతో మరియొక సముద్ర మార్గము నేర్పాటు కావించుకొని రాకపోకల చేయసాగిరి. ఈ విధ ముగ నెలలు గడచిపోయెను. తుట్టతుదకు సిపియో రేవు పట్ట ణమును స్వాధీనపరచుకొని నగరమునందు ప్రవేశించెను. నగర వీధులం దడుగడుగునకు ఘోరముగ యుద్ధము జరిగెను. అసంఖ్యాకులగు సైనికులు వీరస్వర్గము నలంకరించిరి. రోమను సేనలు దుర్గ ప్రాకారములను సమీపించెను. దుర్గమును వశ పరచుకొనుట కనువుగ నుండు నను కారణముచే సిపియో దాని చుట్టు ప్రక్కల గల భవనములకు నిప్పు పెట్టించెను. నేల మాడిగలలో దాగుకొని యున్న అసంఖ్యాకులగు ప్రజలు మరణించిరి. ఇక యుద్ధము చేయుట వలన లాభము లేదని నిశ్చయించి, కోటలోనివారొక రాయబార వర్గమును పంపి కార్ధేజ ప్రజలపై కనికరము చూపవలయునని ప్రార్ధించిరి. సిపియో అచ్చటి ప్రజలను మాత్రము రక్షించుట కంగీకరిం పగా ఏబదివేల మంది పసిపిల్లలు, స్త్రీలు, పురుషులును కోట నుండి వెలువడిరి. 900 మంది జనులు కోటలోని దేవస్థాన ములో దాగుకొని యుండిరి. వారు మాత్రము బయటకు వెడలిరాక దేవళమునకు నిప్పు దరిగొల్పి అందే ప్రాణములను విడచిరి. అప్పటికిని కార్ధేజ నగర మంతవరి చాలభాగము నిలచి యుండెను. దానినైన కాపాడవలయునను ఉద్దేశ్య ముతో సిపియో, రోము ప్రభుత్వము వారికి తన భవిష్య త్కార్యక్రమమును తెలుపవలసినదని కోరెను. రోము నగ రము నందలి యువారులకు కొందరు పౌరులు కార్ధేజ నగర

మును రక్షింప వలయునని యెంత వాదించినను వినక సెనేటు సభవారా నగరమును సంపూర్ణముగ నాశనము కావింప వలయునని ఆజ్ఞాపించిరి. నగరము కట్టబడిన ప్రదేశమును దున్ని వైచి కార్థేజి పట్టణము పేరైన లేకుండ పోవలయునని శాసింపబడెను. విధిలేక సిపియో సేనాని పట్టణమును సంపూర్ణముగ పరశురామప్రీతి కావించెను. పదునేడు దినముల పాటు నిరంతరాయముగ ప్రజ్వరిల్లి హుతాశనుడు శాంతించిన వెనుక రోమను సేనాని ఆ ప్రదేశమును నాగళ్ళతో దున్నించివైచి, సెనేటు సభ వారు ఆజ్ఞాపించిన ప్రకారము, ఆ పట్టణమును పునరుద్ధరించుటకై ప్రయత్నించిన వారికి సర్వనాశనము కల్గుగాక యని శపించెను. ప్యూనిక్ యుద్ధములు వైవిధముగ కార్థేజి నగర వినాశనముతో సమాప్త మయ్యెను. (క్రీ. పూ. 146)

-: కార్థేజి నాగరికత :-

ఫినీషియా ప్రజలచే నెలకొల్పబడిన వలస రాజ్యములలో నిస్సంశయముగ కార్థేజి రాజ్యము శ్రేష్ఠతమ మైనది. కార్థేజి నగరము స్థాపింపబడుటకు పూర్వము కొన్ని శతాబ్దుల కాలము ఫినీషియా వారు పరదేశములలో వ్యాపారము సాగించుచుండిరి. వర్తకము చక్కగ సాగుట కొరకు వారచ్చటచ్చట వ్యాపార కేంద్రముల స్థాపించుచుండిరి. స్పైను దేశము, ఆఫ్రికా ఖండము, మధ్యధరాసముద్రము నందలి దీవులు- అందు ముఖ్యముగా సిసిలీ యందును ఫినీషియా జాతివారి వర్తక కేంద్రములు నెలకొల్ప బడెను. వారి

యైశ్వర్యమునకు ముఖ్యకారణము వారి వ్యాపారమె. ఫినీషియా ప్రజల సంతతి వారగు కార్థేజ వారుకూడ వర్తకమునే తమ ముఖ్యవృత్తిగా కావించుకొని అభివృద్ధిని గాంచిరి. కాని ఒక్క విషయము నందు ఫినీషియా వారికిని కార్థేజ వారికిని చాల భేద ముండెను. ఫినీషియా ప్రజ లెవ్వరిని కూడ నిర్బంధించి వారితో వ్యాపారము సాగింపలేదు. తమతో వ్యాపారము చేయుట లాభదాయక మని గుర్తించి సంతోష పూర్వకముగ తమ్మాహ్వానించిన వారితోడనే వారు వర్తక సంబంధములు కల్పించుకొనెడివారు. విశాలమైన ఈ ప్రపంచమున వర్తకము చేసికొనుటకు దేశములు అనేకములు కలవని వారు చక్కగ గుర్తించిరి. ఇతరులు తమపై ఆకారణముగ దండెత్తి వచ్చినప్పుడు తప్ప వారెన్నడును ఖడ్గమును పూనలేదు. అట్టి సందర్భములలో వారు హోరాహోరిగ పోరుచుండిరి. ఖడ్గ వాదమునకును, వర్తకమునకును ఎట్టి సంబంధము లందును మైత్రి కుదురదని వారు నిరంతరము జ్ఞప్తియందుంచుకొనెడివారు. కార్థేజి రాజ్యమువారట్లు కాక ఒక వంక వ్యాపారము చేయుచు వేరొక వంక సామ్రాజ్యమును నెలకొల్ప వలయునని ప్రయత్నము చేయసాగిరి. వ్యాపారమునందు సంపాదించిన ధనము నంతను వారు యుద్ధములకై వినియోగించిరి. వీరి చరిత్ర యంతయు గ్రీకుల తోడను, రోమను ప్రజల తోడను కావించిన యుద్ధములతో నిండియున్నది. సిసిలీ ద్వీపము, ఇటలీ స్పైను దేశములును, ఆఫ్రికా ఖండమును వీరికి రణరంగములుగ పరిణమించెను.

ఈ నిరంతర యుద్ధములే తుదకు కార్థేజి నగర వినాశనము నకు మూలమయ్యెను.

కార్థేజి రాజ్యము ప్రబలమైనకొలదియు, ఆ ప్రజలు మధ్యధరాసముద్రము నందలి పశ్చిమ ప్రాంతమున వ్యాపారము నంతను తమ చేత చిక్కించుకొని టైరు ప్రజల కచ్చోట స్థానము లేకుండా చేసిరి. అయినను మాతృదేశమునకును, వలస రాజ్యమునకును ఎన్నడును స్పర్థలు లేకుండుటయే కాక వారన్యోన్య సహాయము కావించుకొను చుండెడివారు. కాంబైసస్ అను రాజుకడ ఫినీషియా నావికులు పలువురు కొలువుండిరి. ఆత డీజిప్టు దేశమును జయించి కార్థేజి పట్ట ణముపై దండెత్తవలెనని యత్నించినప్పుడు ఫినీషియా నావికు లందుల కంగీకరింపలేదు. గ్రీకు వీరు డైన అలెగ్జాండరు టైరు పట్టణమును ముట్టడించి నప్పు డచ్చటివారు తమ స్త్రీలను, బిడ్డలను కార్థేజి నగరమునకు పంపివేచి రక్షించుకొనిరి. కార్థేజి ప్రజలు టైరు పట్టణ మందలి మెల్కార్తు దేవుని ఆలయమునకు కానుకలు పంపుచుండెడివారు.

కార్థేజి ప్రజలు టైరు పట్టణవాసుల వలెనే ప్రకృతి శక్తులను దైవతములుగ పూజించుచుండెడివారు. వారు ముఖ్యముగ సూర్య చంద్రులను మోలోచ్, అష్టోరెత్ అను నామములతో పూజించుచుండెడివారు. తమ జాతికేదయిన గొప్ప ప్రమాదములు సంభవించిన పక్షమున వారు సూర్యదేవు నికి నరబలుల నొసంగుచుండిరి.

గ్రీకులతో యుద్ధములు సాగించుచున్న కాలముననే కార్థేజి ప్రజలు తమ రాజ్యాంగ విధానమును రూపొందించుకొనిరి. ఈ రాజ్యాంగమునం దున్నత తరగతుల వారే అధికార పదవులయందు తరచుగ నుండుచు వచ్చినను సామాన్య ప్రజల హక్కుల కెట్టి భంగమును కల్గెడిదికాదని అరిస్టాటిల్ వంటి సుప్రసిద్ధ తత్వజ్ఞుడు నుడివి యున్నాడు. కార్థేజి రాజ్యమునందు రాజుల పరిపాలన మేకాలముననైన ఉండెనో లేదో తెలుపజాలము. కాని అనతికాలములో నచ్చట ప్రజా రాజ్యము నెలకొనెను. ప్రభుత్వాధికార మిరువురు నాయకుల యందు నిక్షిప్తమై యుండెను. వీరు ప్రజలచే ఎన్నుకొనబడుచుండిరి. కొన్ని సందర్భములలో వీరు సర్వసైన్యాధిపతులుగ కూడ నుండెడివారు. 104 మంది సభ్యులు గల యొక శాసనసభ కూడ రాజ్యాంగ యంత్రమునం దొక ముఖ్యభాగముగ నుండెను. ఈ సభ్యులలో కొందరను, ధనాధికుల వర్గము నుండియు, మరికొందరను వారి ప్రతిభా విశేషము పురస్కరించుకొనియు, ప్రజలు ఏర్పాటు చేయుచుండిరి. సుప్రసిద్ధ వీరుడగు హానిబాల్ రాజ్యాంగ శాసనసభయం దెన్నికల పద్ధతిని ప్రవేశపెట్టినట్లు మనము స్థలాంతరమున తెలిసికొని యున్నాము. కార్థేజి నగరమున నెలకొల్పబడిన ప్రభుత్వము మిక్కిలి ఉత్తమమైనదని అరిస్టాటిల్ మిక్కిలి ప్రశంసించి యున్నాడు. కొన్ని సందర్భములలో ప్రత్యేక కుటుంబములవారే ప్రభుత్వాధికారముల నన్నిటిని లాగుకొని కార్థేజి ప్రజలపై అధికారమును నెరపినట్లు నిజ

క్షణములు కలవు. కాని మొత్తమునిూద ఈ రాజ్యాంగ విధానము చెక్కుచెదరక చాలకాలము వరకును అమలులో నుండుట వలనను, నిరంకుశ ప్రభుత్వ మనునది యీ రాష్ట్రి మం దే కాలమునను స్థాపింపబడక పోవుట వలనను, ఈ దేశపు ప్రభుత్వ పద్ధతులు మిక్కిలి జయప్రదముగ కొన సాగెనని తెల్పుటలో నెట్టి సందేహమును లేదు.

కాని తన స్వాధీన మందున్న యితర ప్రాంతములను మాత్రము కార్థేజి ప్రజలు జయప్రదముగ పాలించినట్లు తెల్పుటకు వలనుపడదు. మధ్యధరాసముద్రము నందలి పశ్చిమభాగములోని ద్వీపములును, స్పైను దేశములోని కేంద్రములును సిసిలీ ద్వీపములోని పట్టణములును, ఆఫ్రికాఖండపు తీరమున భూమధ్యరేఖ వరకును వ్యాపించియున్న ఇతర వర్తక స్థలములును, కార్థేజి వారి అధికారము నంగీకరించి కప్పము కట్టుచుండెడివి. వీరి యధికారము నందున్న ఆఫ్రికా నివాసులు కేవలము పశుప్రాయులుగ నుండుటవలన కార్థేజి వారు వారితో స్నేహమును సంపాదించుటకు యత్నింపరైరి. ఆఫ్రికా నివాసులలో పలువురు కార్థేజి పట్టణపు ధనికుల కడ బానిసలుగ పని చేయుచుండిరి. కావున వారికి తమ యజమానుల యెడ నెట్టి యభిమానము లేక అదను దొరికినప్పుడెల్లవారు తిరుగుబాటు చేయుచుండిరి.

క్రీస్తునకు ఆరు నూర్ల సంవత్సరములకు పూర్వమే ఫినీషియా జాతివారు ఈజిప్టు రాజుల ప్రోత్సాహము వలన

ఆఫ్రికా ఖండమును చుట్టివచ్చిరి. వారి జాతికే చెందిన కార్థేజి ప్రజలు కూడ మిక్కిలి నేర్పును, సాహసమును గల నావికులు. వీరు క్రీస్తు పూర్వము అయిదవ శతాబ్దమునందు రెండు ప్రసిద్ధ నౌకా యాత్రలు కావించినట్లు చరిత్రలు తెల్పుచున్నవి. ఇందొకటి ఐరోపా ఖండమునకును, రెండవది ఆఫ్రికా ఖండమునకును సంబంధించినది. ఐరోపా ఖండ యాత్రను గూర్చిన యంశములు విశ్వసనీయములు కావని కొందరి అభిప్రాయము. కాని హానో అను వాని నాయకత్వమున ఆఫ్రికా తీరమున కావింపబడిన యాత్ర నిజమైనదని తెల్పుటకు ఆధారములు కాన్పించుచున్నవి. ఆ కాలము నాటికే కార్థేజి పట్టణమునందు జనసంఖ్య విస్తారముగ పెరిగి పోయెను. కావున హానో తన పడవలలో 30,000 మంది కార్థేజి నివాసులను వెంటబెట్టుకొనిపోయి వారి నాఫ్రికా ఖండమున అట్లాంటిక్ సముద్రతీరమున నచ్చటచ్చట నెల కొల్పె నని తెలియుచున్నది. ఈతడు సెనిగాల్ నదిని దాటి దక్షిణమున కొంతదూరము వరకును ప్రయాణము చేసి మరలి వచ్చెను. మరికొందరు నావికులు హిమిల్కో అను నాతని నాయకత్వమున జిబ్రాల్టరు జలసంధిని దాటి ఉత్తరముగ ప్రయాణము చేసి స్పైను దేశపు తీరమును పరిశీలించిరట. వీరికి ప్రభుత్వము నుండి తగినంత ప్రోత్సాహమును, సహాయమును లభించిన పక్షమున ఇంగ్లాండు దేశమునకు కూడ పోయి యుండెడివారట. స్థిర నివాసమున కనుకూలములగు ప్రదేశముల కనుగొనుటయు, ఆయా ప్రాంతము లందలి ప్రజలతో వర్తకము సాగించుటయు వీరి లక్ష్యము.

కార్థేజి నగరము ప్రాచీన కాలపు గొప్ప పట్టణము లలో నొకటి. ఈ నగరమునకు సంబంధించి చక్కని రేవు స్థానము లేర్పాటు చేయబడెను. పట్టణము చుట్టు బలవత్తరమైన మూడు ప్రాకారము లుండెను. కేవలము నగర మందు నివసించు వారి సంఖ్య రెండు లక్షల ఏబది వేల వరకును ఉండెను. నగర పరిసరముల జన సంఖ్యను కూడ చేర్చిన పక్షమున కార్థేజి పట్టణమం దేడు లక్షల ప్రజలు నివసించు చుండి రని తెలుపవచ్చును. వ్యాపార కేంద్రములుగ ప్రఖ్యాతి గాంచిన ప్రాచీన నగరములలో దీనికి సాటి వచ్చునది మరే పట్టణమును లేదనుట నిస్సంశయము.



# హెట్టయిటులు

ఆసియా ఖండము నందలి అతి పురాతన జాతులలో హెట్టయిటు లనువా రొక్కరు. ప్రాచీన కాలమునందు యూదులు పాలస్తీనము లోనికి వలస వచ్చిన సందర్భములో వారిరాకను ప్రతిఘటించిన వారిలో హెట్టయిటు లొక్కరని బైబిలు గ్రంథము వలన తెలియుచున్నది. కాని ఇటీవల వరకును వీరిని గూర్చిన చారిత్రికాంశము లేవి తెలియలేదు. ఈజిప్టు, అస్సీరియా దేశములలో వీరియునికిని గూర్చిన కొన్ని చిహ్నములు మాత్రము లభించి యుండెను. కాని క్రీ. పూ. 20 వ శతాబ్ది ప్రారంభమున, ఈ జాతి వారికి రాజధానిగ నుండిన "ఖట్టి" అను పట్టణపు శిథిలములు "క్యాప్పెడోసియా" రాష్ట్రములో కానవచ్చెను. ఈ కాలపు ప్రభువుల కార్యాలయములలో హెట్టయిటు జాతి చరిత్రకు చెందిన అనేక నూతనాంశములు తెలియవచ్చినవి.

హెట్టయిటుల జన్మభూమి ఆసియా ఖండము యొక్క పశ్చిమభాగమున నున్నది. దీనికి ఉత్తరభాగమున నల్ల సముద్రమును, దక్షిణమున మధ్యధరాసముద్రమును కలవు. పశ్చిమమున నీరాష్ట్రమునకు ఏజియను సముద్రము ఎల్లగ నుండెను.

తూర్పున పర్వత పంక్తులును, ఇతర భూభాగములును కలవు. ఈ దేశమును నేటి భూగోళశాస్త్రములో ఆసియా మైనరు లేక టర్కీ అని వ్యవహరింపవచ్చును. హెట్టయిటు ప్రజలు తమ ఉచ్ఛదశయందు ఏజియను సముద్రము మొదలుకొని అర్మీనియాకు కొండలవరకుగల భూభాగమునంతను వశపరచుకొనిరి. సిరియాదేశమునందలి ఉత్తరభాగమును, మెసొపొటేమియా రాష్ట్రమునందలి కొన్ని భాగములును కూడ ఒకానొకప్పుడు వీరి రాజ్యమునందు భాగములుగ నుండెడివి.

-: ఏ జా తి వా రు ? :-

హెట్టయిటుజాతి యే తెగకు చెందినదను విషయము నిదమిత్థముగ నిర్ణయించుటకు సరియైన యాధారములు లేవు. వీరి భాషకును, హైందవ ఆర్యభాషలకును సన్నిహిత సంబంధము కలదని కొందరి యూహ. రూపరేఖావిలాసముల వలన వీరిని ఆర్యజాతులలోకాని, సెమెటిక్ జాతులలోకాని చేర్చుటకు వలను పడదు. కావున హెట్టయిటులను ఆసియా మైనరు నందలి యొక ప్రత్యేక స్థానిక జాతిగ పరిగణింపవలసి వచ్చుచున్నది. తరచుగ రాకపోకల వలనను, వ్యాపారాదుల వలనను హెట్టయిటులకు బాబిలోనియా జాతితో ఎక్కువ సంబంధము లేర్పడిన కారణమున వీరి నాగరకతయందు బాబిలోనియా నాగరకత ప్రభావము బాగుగా కాన్పించుచున్నది. ఇట్టి సంబంధములు క్రీ. పూ. 24 వ శతాబ్ది నాటికే నెలకొల్పబడినట్లు తెలియుచున్నది.

బాబిలోనియా ప్రజలు ఇటుకలపై అనేక విషయము లను వ్రాసి వారినే పుస్తకముల తీరుగ వాడుకొనెడి వారు. హెట్టయిటులు కూడ ఈ పద్ధతినే అవలంబించిరి. కాని తమ ప్రత్యేక లిపిని మాత్రము విడువలేదు. వీరి లిపియందు ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క బొమ్మ వాడబడు చుండెను. హెట్టయిటుజాతివారి శిల్పమునందుకూడ ప్రత్యే కత యుండెను. "యాసిలికాయా" అను ప్రదేశమున పర్వత ములపై వీరు మతసంబంధములగు అనేక చిత్రములను చిత్రిం చిరి. వీనియందు సైతము బాబిలోనియావారి ప్రభావ మొకిం చుక కాన నగును.

హెట్టయిటుల ప్రాచీన చరిత్రను గూర్చిన యెట్టి విష యములును మనకు లభింపలేదు. క్రీ. పూ. 1750 . సంవత్స రమున వీరు హఠాత్తుగ చారిత్రిక రంగములోనికి దుమికి, మెసాపొటేమియా దేశముపై దండెత్తి, అచ్చటి రాజవం శమునోడించి, రాజధానియగు బాబిలోను నగరమును ముట్ట డించి, అచ్చటి మార్ధూక్ మున్నగు ,దేవతా విగ్రహములను కొల్లగొట్టి స్వదేశమునకు మరలిపోయిరి. ఇది ప్రారంభముగ హెట్టయిటులు తమరాజ్యమునకు దక్షిణమునను, ప్రాగ్దక్షిణ మున నున్న ఇతర ప్రాంతములపై దాడులు కావించుట సాగించిరి. వీరి ముఖ్యస్థానము అనటోలియా మైదానమం దందలి ఖట్టీయను ప్రదేశము. ఈ పట్టణము వివిధప్రాంతములకు పోవు రహదారులకు కూడలిగ నున్నందున హెట్టయిటు లితర స్థలములకు పోవుట మిక్కిలి సులభ సాధ్యముగ నుండెను.

-: రాజ్యాంగ వ్యవస్థయెట్టిది? :-

ప్రథమమున హెట్టయిటు దేశమందెట్టి కేంద్రప్రభుత్వ మును లేకుండెను. ఒక్కొక్క ప్రాంతమునం దొక్కొక్క రాజు స్వతంత్ర పరిపాలనము సాగించు చుండెడివాడు. ఈ రాజ్యములు మిక్కిలి చిన్నవి. వీనియందు రాజధానీ నగర మును దానికి సంబంధించిన కొన్ని భూఖండములు నుండెడివి. గ్రీకుదేశమునందు వీనిని పోలిన చిన్న చిన్న రాజ్యము లుండుట చరిత్ర నెరింగిన వారి కెల్లరకును సువిదితమే. వీనిని "నగర రాజ్యము" ( City States) లని రాజకీయ పరిభాషలో వ్యవహరించు చున్నారు. ఈ చిన్న రాజ్యములలో కొన్ని గొప్ప ప్రాముఖ్యతను సంపాదింప గల్గెను. ఆర్జవా అను పట్టణమునకు ప్రభువైన యాతడు ఈజిప్టురాజు కుమార్తెను వివాహమాడెను. కుస్సార్ అను పట్టణమునకు పాలకుడగు షుబ్బిలూలిమా అను నాతడు హెట్టయిటుజాతి నంతనుకూడ తన యాధిపత్య ములోనికి గొనివచ్చి యొక రాజ్యమును స్థాపించెను. ఈ రాజ్యము రెండు శతాబ్దముల వరకును పేరు ప్రఖ్యాతులు కలిగి రాణించెను.

-: రాజులు :-

హెట్టయిటుజాతి చరిత్రయందు షుబ్బిలూలిమా యను నాతడు మిక్కిలి ప్రఖ్యాతి గాంచిన ప్రభువు. ఈతడు గొప్ప వీరుడుగను రాజనీతిజ్ఞుడుగను కాన్పించు చున్నాడు. ఈరాజు వంశక్రమాగతమగు కుస్సార్ పట్టణమును విడచిపెట్టి ఖట్టీనగ రమును తనకు రాజధానిగ కావించుకొనెను. ఈ పట్టణము

సురక్షితమును, యుద్ధప్రయోజనములకు కనుకూలముగ నుండుట యును దీనికి కారణమై యుండవచ్చును. ఈ కేంద్రమునుండి యీ రాజు సామదండోపాయములచే హెట్టయిటు రాజ్యము నందే కాక పరిసర దేశములలో కూడ తన యాధిక్యతను స్థాపిం చుకొన గల్గెను. ఈషుబ్బిలూలిమా రాజు ఈజిప్టుప్రభువులతో సంధిని నెరపెను. కాని రహస్యముగ నప్పుడప్పు డీజిప్టురాజు సామంతులను తిరుగుబాటుచేయుటకై ప్రోత్సహించు చుండెడి వాడు. అట్టి సామంతులలో సిరియా పాలకుడొక్కడు. ఈసిరి యారాజును షుబ్బిలూలిమా అనేక పర్యాయము లోడించి ఆతనిరాజ్యమును కొల్లగొట్టెను. ఈకాలమునందు హెట్టయిటు జాతివారికి మిటానీ తెగ వారు ప్రతిపక్షులుగ నుండిరి. షుబ్బి లూలిమా రాజు యూఫ్రటీసు నదిని దాటి మిటానీ ప్రభు వుల నోడించి, వారి దేశమును కొల్లగొట్టి, ప్రభువులను చెర పట్టి అసంఖ్యాకము లగు ధనరాసులతో తన రాజ్యమునకు మరలి వచ్చెను. కాని మరికొంత కాలము గడచిన వెనుక "మాటియుఆజా" అను మిటానీ రాజకుమారునికి షుబ్బి లూలిమా తన కుమార్తె నిచ్చి, వివాహము చేసి ఆతనిని మిటానీ రాజ్యమున ప్రతిష్ఠించెను. తన కుమార్తె క్షేమ మును, సౌఖ్యమును కోరి తాను మిటానీ రాజ్యమునకు పునః ప్రాణ ప్రతిష్ఠ చేసితి నని యీరాజు సగర్వముగ చాటు కొనెను. షుబ్బిలూలిమా కుమారుడగు మర్సిల్ అనువాని కాలములో హెట్టయిటు రాజ్యము క్షీణదశకు లోనయ్యెను.

-: యుద్ధములు :-

హెట్టయిటులకును, ఈజిప్టు ప్రభువులకును యుద్ధములు ప్రారంభ మయ్యెను. ఈజిప్టు రాజులు ఫినీషియా, కానాన్ రాష్ట్రములను ఆక్రమించిరి. ముర్సిల్ 2 మారుశగు ముటాలూ అనువాని కాలమున ఈజిప్టు పాలకు డగు రెండవ రామెసెస్ అను నాతడు హెట్టయిటు సైన్యములను కాడెష్ అను ప్రదేశమున సంపూర్ణముగ నోడించెను. ఈ యుద్ధమునందు హెట్టయిటులు గొప్ప ధైర్య సాహసములను, రణ కౌశల్యమును చూపినట్లు సమకాలిక గ్రంథముల వలన తెలియనగు చున్నది. ఈ కాడెష్, యుద్ధమునందలి అనేక ఘట్టములు లక్సర్, కార్నక్, అబిడాస్ అను ప్రదేశము లందలి దేవాలయ కుడ్యములపై చిత్రింపబడెను. ఈ యుద్ధమును వర్ణించు నొక ప్రాచీన పద్య కావ్యము నేటికిని బ్రిటీషు మ్యూజియము నందు భద్రపరుపబడి యున్నది. ఈ యుద్ధమునందు ఈజిప్టు రాజైన రెండవ రామెసస్ తన అంగ రక్షక బలము తోడను, ప్రత్యేకముగ యుద్ధ శిక్షణ నందిన ఒక పెంపుడు సింహము సహాయముతోను, శత్రువుల నోడించెనని తెలిసికొనినప్పుడు మనలో పలువురకు విస్మయానందములు కలుగక పోవవు. కొంతకాలము వరకును ఈ విధముగ యుద్ధములు సాగిన పిమ్మట ఈజిప్టు రాజులును, హెట్టయిటు ప్రభువులును కూడ విసువు చెంది ఒండొరులతో సంధి కావించుకొనిరి. ఈ సంధి షరతులను హెట్టయిటు రాయబారి ఈజిప్టు రాజునకు వెండి రేకులపై చెక్కించి సమ

ర్పించినట్లు తెలియుచున్నది. కార్నక్ అను ప్రదేశమునందలి దేవాలయపు గోడలపై కూడ ఈ సంధి వివరములు కాన నగుచున్నవి. ఈ సంధి పత్రమును హెట్టయిటులు బాబిలోనియా భాషలో వ్రాసికొని తమ వద్ద దాచుకొనిరట. నేటి కాలమున రాజనీతిజ్ఞు లెల్లరును ఫ్రెంచి భాషను వాడు చున్నట్లు, ఆ ప్రాచీనులు బాబిలోనియా భాషను వాడెడి వారు కాబోలు.

-: విదేశీయులతో బాంధవ్యము :-

ఈ కాలమున హెట్టయిటుప్రభువుగ నున్న ఖట్టూసిల్ అను నాతడు బాబిలోనియా రాజ్యముతో స్నేహ భావమున వర్తించెను. ఇతడే మరికొంత కాలము గడచిన తరువాత సకుటుంబముగ ఈజిప్టు దేశమున కేగి తన కుమార్తెను అచ్చటి రాజగు రెండవ రామెసస్‌న కిచ్చి వివాహము చేసెను. ఈ విధముగ రెండు రాజ్యములకును గాఢమైన సఖ్యత యేర్పడెను. ఖట్టూసిల్ కుమారుడును, మనుమడును కూడ ఈజిప్టు రాజులతో మిత్రభావమున వర్తించిరి. వీరిలో అరునాడా యను హెట్టయిటు రాజు ఈజిప్టు సంప్రదాయము ననుసరించి తన చెల్లెలిని వివాహము చేసికొనెనట.

-: అంత్య దశ :-

అరునాడా రాజు అనంతరము హెట్టయిటు రాజ్యము క్షీణించెను. వీరి దేశముపై "ఫ్రిజియనులు" అను పరజాతి

వారు దండెత్తి హెట్టయిటులను దక్షిణమునకు తరిమివైచిరి. హెట్టయిటు లా పైన ఉత్తర సిరియా యందు చిన్న చిన్న రాజ్యములను స్థాపించుకొని కొంతకాలము వరకును నిలువ గల్గిరి. ఇట్టి రాజ్యములలో యూఫ్రటిస్ నదీ తీరము నందలి "కార్కిమిష్" అను రాజ్యము ముఖ్య మైనది. అస్సీరియా రాజ్యము ప్రబల మైన పిమ్మట అచ్చటి రాజులు ఉత్తర సిరియాపై దండెత్తి ఆ దేశము నాక్రమించిరి. రెండవ సారి గాన్ రాజు క్రీ. పూ. 717 సంవత్సరమున కార్కిమిష్ నగ రము నాక్రమించి అచ్చటి హెట్టయిటు ప్రభువును చెర పట్టెను. మారాష్ అను మరియొక నగరము హెట్టయిటు లకు కేంద్ర స్థానముగ నుండెను. దానిని కూడ మరికొంత కాలమునకు అస్సీరియా రాజు లాక్రమించిరి. ఇంతటితో హెట్టయిటుల ప్రత్యేకత నశించి వారు సిరియా దేశపు ప్రజ లలో లీనమై పోయిరి.

---

# ఫ్రిజియనులు

-: గ్రీకు అనాగరిక జాతి :-

హిట్టయిటు జాతి చరిత్రను వర్ణించు సందర్భమున ఆసియామైనరును గూర్చిన భౌగోళిక విషయములు కొన్ని తెలుపబడినవి. ఈ దేశము పూర్వార్ధ పశ్చిమార్ధ గోళములను సమ్మేళనము కావించుటచే దీని కెక్కువ చారిత్రిక ప్రాముఖ్యత యుండుట సహజము. కాని యీ ప్రాంతము పర్వత మయమై యున్న కారణమున నిచ్చట ఒక కేంద్ర ప్రభుత్వమును స్థాపించి రాజ్యపాలనము చేయుట సాధ్యము కాని పని. అయినను హిట్టయిటు ప్రభువు లాసియా మైనరు నందలి చాలభాగమును తమ యధీనములోనికి గొనివచ్చి రాజ్య పాలనము కావించిన యంశ మీవరకే తెలుప బడినది. హిట్టయిటుల యనంతర మాసియామైనరునందు ప్రభుత్వము నెరపిన వారిలో ఫ్రిజియనులను మొదట పేర్కొన వలయును.

ఫ్రిజియనులు ప్రథమమున ఈనాటి గ్రీసు దేశమునం దంతర్భాగ మైన త్రేసు రాష్ట్రములోని అనాగరక జాతి వారు. వీరు స్వరాష్ట్రమును వదలి, బాస్ఫరను జలసంధిని

దాటి క్రీ. పూ. పదమూడవ శతాబ్ది యందు ఆనటోలియా రాష్ట్రమును ప్రవేశించి యుండవచ్చును. వీరు స్థిర నివాస మేర్పరుచుకొనిన భూభాగమునకు "ఫ్రిజియా" అని పేరు కల్గెను. ఈ జాతి వారు క్రీ. పూ. పదవ శతాబ్ది వరకును కూడ ఫ్రిజియా ప్రాంతమునకు వలస వచ్చుచునే యుండిరి. ఈ వలస కాలము నందలి ప్రథమ దశలో ఫ్రిజియనులకును స్థానిక ప్రజలకును నిరంతరము యుద్ధములు సాగినట్లు ప్రాచీన గాథల వలన తెలియుచున్నది.

-: రాజపరణము :-

క్రీ. పూ. ఎనిమిది ఏడు శతాబ్దులలో ఫ్రిజయను జాతివారందరును ఏకమయినట్లును తత్ఫలితముగ వారి ప్రభుత్వము స్థాపింపబడినట్లును తెలుపవచ్చును. ఫ్రిజియనులలో మొదటి రాజు గోర్డియస్ అనువాడు. ఈతడు మొట్టమొదట ఒక సేద్యగాడు. ఈతనిని గూర్చిన యొక గాథ నేటికిని ప్రచారములో కలదు. ఫ్రిజియా రాష్ట్ర ప్రభువు సంతతి లేకుండ మరణించెను. అంతట ప్రజలందరును మహాజ్ఞాని యైన తమ గురువు వద్దకు పోయి దేశమున నరాజకత్వము ప్రబలకుండుటకై ఏదైన నొక యుపాయమును చూపుడని కోరిరి. అప్పుడా జ్ఞాని యిట్లు చెప్పెను. "పుర ప్రముఖు లందరును ఉదయముననే లేచి పట్టణపు సింహద్వారము వద్ద వేచియుండవలెను. మొట్టమొదట నెవ్వడు సింహద్వారముగుండ పోవునో ఆతడే మీకు రాజు" ఆ మరునాడు పౌరు లెల్లరును నగర ద్వారము వ

వేచియుండి, ఆ ద్వారమునుండి పోవుచున్న గోర్డియన్ అను హాలికుని తమ రాజుగ ఎన్నుకొనిరి. ఈ రాజు మిక్కిలి సమర్థుడని ప్రతీతి గలదు. ఈతడు తాను రాజుగ ఎన్నుకొనబడిన సందర్భములో తాను తోలుచున్న బండినొక దేవాలయములో భద్రపరచి దాని కాడిని కట్టుటకై యొక విచిత్రమగు ముడిని వైచెను. ఈ ముడిని విప్పిన బుద్ధిశాలి ఆసియా ఖండమున కంతకు రాజగు నని యొక ప్రతీతి వ్యాపించెను. ఈ బ్రహ్మముడిని విప్పుట కెవ్వరికిని సాధ్యపడలేదు. తుదకు క్రీ. పూ. నాల్గవ శతాబ్ది యందు జగదేక వీరు డైన అలెగ్జాండరు ఫ్రిజియా దేశమునకు వచ్చి గోర్డియన్ రచించిన వ్యూహమును విప్పజాలక తన ఖడ్గముతో ఆ ముడిని తెగ కోసెను. ఇది పాశ్చాత్య జాతులలో నొక సామెతగా మారినది. గోర్డియన్ ముడిని 'ఛేదించుట (To cut the Gordian knot) అనగా మిక్కిలి దుస్తరమైన కార్యమును ధైర్య సాహసములచే సాధించుట యని అర్థము.

-: తర్వాతి రాజులు :-

ఈ గోర్డియన్ కుమారుడు మైడాస్ అనువాడు. గోర్డియన్, మైడాస్ అను పదములు కేవల వ్యక్తుల నామములుగా కాక బిరుదములుగా ఫ్రిజియా ప్రభువులు వాడుచుండినట్లు తోచుచున్నది. ఈ పేరులుగల రాజన్యు లనేకులు ఫ్రిజియా రాజ వంశావళిలో కలరు. మైడాస్ రాజును గూర్చి అనేక విచిత్ర గాధలు కలవు. బంగార మనిన ఈతనికి విపరీత మైన లోభము. దేవతలను ప్రార్థించి తాను ముట్టినవెల్ల బంగారముగా మారున ట్లీతడు వరమును పొందెను.

కాని యీ వరము వలన నీతనికి, సౌఖ్యమునకు మారు దుఃఖమే సంప్రాప్త మయ్యెను. ఈతడు ముట్టిన నీరును, అన్నమును, తుదకు బిడ్డయు కూడ బంగారముగా మారి పోయిరి. అంతట యీ మహాలోభి తాను కోరిన వరము వలన నెంతటి అనర్థము లున్నవో గ్రహించి దేవతలను ప్రార్థేయపడి యీ సువర్ణ శక్తిని మాన్పుకొనుసరికి తల ప్రాణము తోకకు వచ్చెను. ఈ నాటికిని కూడ పాశ్చాత్య సాంప్రదాయములో మైడాస్ అనగా మహాలోభియు ధనికుడు నని యర్థము. ఈ కథల యందలి యాథార్థ్యము ఫ్రిజియా రాజులు మిక్కిలి ధనాఢ్యులుగ నుండి రని తెల్పుట మాత్రమే యని చారిత్రికులు తలంచుచున్నారు. క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్ది యందీ రాజులు తమ యధికారమును విస్తరింప జేసి లిడియను జాతి వారిని పాలితులుగ శాసించుకొనిరి. ఈ శతాబ్ది యందు వీరికిగల ప్రాముఖ్యతను అస్సీరియా ప్రభువైన సారగాన్ అను నాతడు తన శాసనము లందు అంగీకరించెను.

-: క్షీణ దశ :-

క్రీ. పూ. ఏడవ శతాబ్ది యందు ఫ్రిజియనుల యాధిక్యత క్షీణించెను. కాకసస్ పర్వతము లందు నివసించు సిమేరి యను లను అనాగరక జాతి వారు ఫ్రిజియా దేశముపై దండెత్తి దేశమును కొల్లగొట్టిరి. ఈ దాడులవలన ఫ్రిజియనుల బలము క్షీణింపగా, నింత వరకును వీరి యధికారము నంగీకరించిన లిడియనులు ప్రాముఖ్యతను వహింపసాగిరి.

---

# లిడియనులు

ప్రాచీన జాతులలో లిడియనులు మిక్కిలి ప్రాముఖ్యత వహించిరి. ఏజియను సముద్రపు తూర్పు తీరమున ఆయోనియా జాతివారనేక వర్తక కేంద్రములను స్థాపించుకొని యుండిరి. ఆ వర్తక కేంద్రములలోనికి రాకపోకలు సలుపుటకు లిడియా దేశము గుండ పోవలెను. ఈ కారణముచే లిడియా రాష్ట్రమునకు వ్యాపార రీతిని మిక్కిలి ప్రాధాన్యత యుండెను. నాణెములను ముద్రించి వానిని వాడకములోనికి తెచ్చినది లిడియా దేశీయులే యని చారిత్రికుల యుద్దేశ్యము.

-: రాజ వంశములు :-

హెరోడోటస్ అను గ్రీకు చరిత్రకారుడు లిడియా దేశమును మూడు భిన్న రాజ వంశములు పాలించి యుండినట్లు తెల్పుచున్నాడు. కాని యీ విషయమును యథార్థమని నమ్ముటకు తగిన యాధారములు లేవు. ఇచ్చటి రాజులలో గేజెస్ అను నాతడు చారిత్రిక పురుషుడుగ కానవచ్చుచున్నాడు. ఈతడు "మర్మ్నాడు" రాజ వంశమును స్థాపించెను. క్రీ. పూ. ఏడవ శతాబ్ది యందు సిమేరియను లను అనాగరక

జాతి వారు ఆసియామైనరు పై దాడి వెడలి ఫ్రిజియను రాజ్యమును కూలద్రోసి నట్లు తెల్పియున్నాము. ఈ సిమేరి యనుల వలన లిడియను జాతి వారికి సైతము మిక్కిలి నష్టము సంభవించెను. క్రీ. పూ. 668 ప్రాంతమున గేజెస్ రాజు అస్సీరియా ప్రభువైన అషుర్ బనిపాలుని వద్దకు రాయ బారులను పంపి సిమేరియనుల దాడుల నెదుర్కొనుటలో తనకు సహాయ పడవలసిన దని కోరెను. కాని అస్సీరియా రాజు లిడియావారి కెట్టి సహాయమును నొసంగ దయ్యెను. సిమేరియనులు గేజెస్‌ను చంపివైచిరి. అతని కుమారుడగు ఆర్డిస్ అనువాడు అయోనియా ప్రజలతో స్నేహము కావించుకొని తమ కిరువురకును సమానముగ నష్టము కల్గించు చున్న సిమేరియా అనాగరకులను ఆసియా మైనరు నుండి వెడల నడచెను.

ఆర్డిస్ రాజు తరువాత సాడ్యాటిస్, అల్యాటిస్ అను ఇరువురు రాజులు లిడియా దేశమును పాలించిరి. వీరి కాల మున దేశము సుభిక్షముగను, సౌఖ్యవంతముగను మారెను. ఈ రాజులు చాలకాలము వరకు అయోనియా జాతి వారితో యుద్ధములు సాగించిరి.

-: యుద్ధములు :-

ఈ యుద్ధముల వలన లిడియా వారికి నామమాత్ర మగు శుష్క విజయములు సంప్రాప్తించెను. కాని యితరము లగు ఎట్టి లాభమును కలుగలేదు. మరికొంత కాలమునకు

వీరికి "మీడులు" అను మరియొక జాతివారితో యుద్ధము చేయవలసి వచ్చెను. క్రీ. పూ. 585 సం॥ హేలిస్ నది తీరమున ఇరు పక్షముల వారును గొప్ప యుద్ధమునకై తలపడిరి. ఆ దినమున సూర్యగ్రహణముచే పగటివేళయందే చీకట్లు క్రమ్మునసరికి ఇరుపక్షముల వారును భయపడి దేవతల కాగ్రహము కల్గియుండిన ఇట్టి అవస్థను కల్గినదని విశ్వసించి యుద్ధము నాపివైచిరి. మరికొంత కాలమునకు బాబిలోనియా రాజైన రెండవ నెబుచడ్నిజారు మధ్యవర్తిగ నుండి వీరిరువురికిని సంధి కావించెను. ఈ సంధి ననుసరించి యిరు పక్షముల వారును హేలిస్ నదిని తమ రాజ్యములకు సరిహద్దు నంగీకరించిరి.

-: క్రీసస్ ప్రభువు :-

లిడియా దేశమును పాలించిన తుట్టతుది రాజు క్రీసస్ అనువాడు. ఇతని కాలములో లిడియా రాజ్యము కీర్తి నలుదెసల వ్యాపించెను. ఈ రాజు గొప్ప ధనాఢ్యుడు. ఇతని యాస్థానమునకు పలువురు గ్రీకు విద్వాంసులును, తత్వజ్ఞులును వచ్చుచుండెడివారు. అట్టి వారిలో సోలన్ అను తత్వజ్ఞుడొక్కడు. ధనమును, ఐశ్వర్యమును, అధికారమును శాశ్వతములు కావని క్రీసస్ రాజునకు నచ్చచెప్పుటకై ఈ వేదాంతి ప్రయత్నించెను. కాని ఫలితము లేకపోయెను. రాజు సోలన్‌ను నిరాదరణ చేసి పంపివైచెను. అనతికాలములోనే క్రీసస్ రాజ్యముపై సైరస్ అను పారసీక రాజు దండెత్తి వచ్చెను.

క్రీసస్ ప్రభువు తనకు సహాయపడవలసిన దని స్పార్టా, ఈజిప్టు, బాబిలోనియా రాజ్యములకు రాయబారుల నంపి, తన రాజధాని యగు సార్డిస్ నగరమున దాగుకొనెను. కాని యితర రాజుల నుండి సహాయము వచ్చుటకు పూర్వమే సైరస్ రాజు సార్డిస్ నగరమును ముట్టడించెను. సైరస్ రాజు తన శత్రు వగు క్రీసస్ చంపకుండ విడచిపుచ్చె నని కొన్ని గాథల వలన తెలియుచున్నది. ఏది యెట్లున్నను లిడియా రాజ్యము మాత్ర మింతటితో నశించెను.



# ఆంధ్ర చంద్రికా గ్రంథమాల

## నియమములు

౧. ఈ గ్రంథమాలలో దేశచరిత్రలు, మహా పురుషుల జీవితములు, ప్రకృతి శాస్త్రములు, ఇతర విజ్ఞానాత్మక గ్రంథములు ప్రకటింప బడును.

౨. ఈ గ్రంథములన్నియు ప్రజా సాహిత్య సంబంధములుగా నుండి, సులభమైన వచనశైలిలో ఆకర్షణీయముగా ప్రకటింపబడును.

౩. ఈ గ్రంథమాలకు చందా లేదు. మాసపత్రిక కాదు. గ్రంథము తయారు కాగానే చందాదారులకు వి. పి.గా పంపబడును.

౪. మా గ్రంథమాల ప్రచురణము లన్నియు గొనుటకు నొప్పుకొనువారు "శాశ్వతపు చందాదారు" లనబడుదురు.

౫. శాశ్వతపు చందాదారులు కాగోరువారు, తమయామోదమును లిఖిత పూర్వకముగా తెలిపి ఒకరూపాయి ప్రవేశరుసుముగా చెల్లించవలెను.

౬. శాశ్వతపు చందాదారులకు మా గ్రంథమాల పుస్తకముల వెలలో నాల్గవభాగము తగ్గించి గ్రంథములు తయారు కాగానే వి. పి. గా పంపబడును. పోస్టుకర్చులు చందాదారులే భరించవలయును.

౭. ఇంతవరకు ఆంధ్ర వాఙ్మయములో లేని గ్రంథములే ఇందు ప్రకటింపబడును. ఈ గ్రంథములలో విషయవర్ణనకు సంబంధించిన పటములు, గ్రంథకర్తల పటములు ఉండును.

౫. ఆంధ్రభాషకు పుష్టి కలిగించుటయు, ఆంధ్రులలో విజ్ఞాన చంద్రికలను ప్రసరింపజేయుటయు మా యుద్దేశము. డబ్బు సేకరింపవలెనని మా యుద్దేశము కాదు.

౬. ఆంధ్రభాషాభిమానులందరును గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులుగా చేరి, మా భాషా వ్యవసాయమునకు ప్రోత్సాహమొసంగి, ఆంధ్రసరస్వతీదేవి ఆరాధనమునందు పాల్గొని కృతకృత్యులు గావలయునని మా విజ్ఞాపన

---

## ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు

### ౧. విస్మృత సామ్రాజ్యములు.

ఇదియొక చరిత్రగ్రంథము. నవలవలె మనోరంజకముగా నుండు కథాంశములతో నొప్పారుచున్నది. ఇందు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియాయను ప్రాచీనసామ్రాజ్యములచరిత్ర వర్ణింపబడినది.

ఈ సామ్రాజ్యములు నాలుగయిదు వేల సంవత్సరముల క్రిందట మిగుల వైభవ దశలోనుండి కాలపురుషుని ప్రభావమున మాటుపడిపోయినవి. ఈసామ్రాజ్యములసభ్యత, శిల్పసంపద, మతవిశ్వాసములు, ఆచారములు, విజ్ఞానము, శౌర్య పరాక్రమములును మున్నగు పెక్కు విషయములను గూర్చి మనోహరముగా, అందరకర్థమగునట్లు ఈగ్రంథమురచింపబడినది.

గ్రంథకర్త: శ్రీఖండవల్లి బాలేందు శేఖరం, ఎం, ఏ.గారు.

పుటలు ౨౬౦. వెల: చందాదారులకు రు. ౨-౦-౦

ఇతరులకు, రు. ౨-౧౨-౦

( ప్రతులు అయిపోయినవి )

# ౨ తెలంగాణా ఆంధ్రోద్యమము

( మొదటి భాగము )

ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో ఇది రెండవ కుసుమము. ఇది తెలంగాణములోని ఆంధ్రోద్యమమునకు సంబంధించిన చరిత్రగ్రంథము. ఇచ్చట ఆంధ్రులు తాము ఆంధ్రులమను సంగతి నెరుంగక, సాంఘికముగ, రాజకీయముగ, భాషావిషయికముగ, వెనుకబడి యున్న తరుణమున వారిని మేల్కొల్పిన పవిత్రోద్యమ చరిత్ర మిది. ఈ ఉద్యమ ప్రభావమున ఆంధ్రులకు రాజకీయముగ అస్తిత్వము లభించినది. ఆంధ్రభాషకు ప్రచండ ప్రోత్సాహము కలిగినది. ఆంధ్రసంఘములకు గట్టి కట్టుదిట్టములేర్పడినవి. ఇప్పటి వివిధోద్యమముల యందు ఆంధ్రులు చూపుచున్న చైతన్యమునకు బీజములు నాటి దోహదము కావించిన దీ ఆంధ్రోద్యమమే.

ఈ ఆంధ్రోద్యమ రథమునకు బుజాలు వేసిన మహనీయుల కృషి చక్కగా వర్ణింపబడినది. వారి పటములును ముద్రింపబడినవి. అతిశయోక్తులు లేకుండ, యథార్థ విషయములు మాత్రమే సప్రమాణములుగా వ్రాయబడినవి. ఈ గ్రంథమును ఆంధ్రులందరు చదివితీరవలయును.

గ్రంథకర్త : శ్రీ మాడపాటి హనుమంతరావు గారు.

పుటలు ౧౬౨. వెల: చందాదారులకు రు. ౧-౮-౦

ఇతరులకు ౨-౦-౦

## 3. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

( మొదటి భాగము )

అతి పురాతన కాలమునుండి క్రీ.శ. ౧౮౦౦ వరకు మన మాతృభాషయగు నాంధ్రమున, సాహిత్యము పొందిన వివిధ దశలు ఈ గ్రంథమున చక్కగ విశదీకరింపబడినవి. ఏతద్గ్రంథ ప్రత్యేకత్వము, ఏతద్గ్రంథకర్త ప్రతిభ ఆంధ్రలోక ప్రశంసను పొందదగియున్నవి. ఇందభివర్ణితములైన కళాక్షేత్రముల ప్రశంస, వచన వాఙ్మయవిన్యాసము, తెలంగాణకవుల యుదంతము, ఆంధ్ర కవయిత్రుల ముచ్చట, చారిత్రక కావ్యముల ధోరణి, యక్షగానముల సంవిధానము, శతకవాఙ్మయపు రీతులు, గేయవాఙ్మయ సౌందర్యము, ఇత్యాది ప్రకరణములు ఆంధ్రవాఙ్మయము యొక్క వైశాల్యమును, శాఖలను, అభిరుచులను, గాంభీర్యమును, శోభను ప్రకాశమానము గావించుటకు ఎంతయు తోడ్పడుచున్నవి. శైలి మృదుమధురముగ, ఇంపై యలరారుచున్నది. ఆంధ్రజనులు ఇందలి సాహిత్య చరిత్రామృతమును గ్రోలి యానందింతురు గాక!

కర్త: ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు. ఎం. ఏ.

పుటలు ౩౭౫. వెల: చందాదారులకు రు. ౨-౮-౦

ఇతరులకు రు. ౩-౦-౦

(సాదాప్రతులు అయిపోయినవి. బైండు ప్రతులకు రు. ౦-౬-౦ అధికము)

## ౪. ప్రాచీనాంధ్ర నగరములు

( మొదటి భాగము )

ఇందు అలంపురము, ఆనగొంది, కల్యాణి, కొండాపు
రము, కొలనుపాక గోలకొండ, పానుగల్లు, ప్రతిష్ఠానము.
భోనగిరి, రాచకొండ, వరంగల్లు, వేల్పుకొండ అను పండ్రెండు
నగరముల చరిత్ర కలదు. పూర్వాంధ్రుల వైభవమును,
ధార్మిక, రాజకీయ, శిల్పకళా చాతుర్యములను జాటెడు మహ
త్తర మయిన చారిత్రిక గ్రంథము.

కర్త : పండిత ఆదిరాజు వీరభద్రరావుగారు.

పుటలు ౧౪౦ వెల: చందాదారులకు రు. ౧-౮-౦
ఇతరులకు రు. ౨-౦-౦

## ౫. తెలంగాణా ఆంధ్రోద్యమము

( రెండవ భాగము )

దీనిలో తెలంగాణపు పదునెనిమిదివత్సరముల ఆంధ్రో
ద్యమ చరిత్ర సప్రమాణముగా ౨౨ ప్రకరణములందు వర్ణిత
మైనది. ఇంచుమించు ౪౦౦ పుటలుగల ఈ పుస్తకములో
౧౩ ఆంధ్రమహాసభల వివరములును, పది ఆంధ్రమహిళా
మహాసభల సంగ్రహ వివరణమును కలవు. పదుగురు అధ్యక్ష
మహాశయులయు, ఎనిమిదిమంది అధ్యక్షురాండ్ర యొక్కయు,
కొన్ని సమావేశముల యొక్కయు, సుప్రసిద్ధులగు ఆంధ్ర-
ఆంధ్రేతర మహాశయుల యొక్కయు, సోదరీమణుల
యొక్కయు పటములు దీని శోభను ఎన్నియో రెట్లు పెంపొ

దించు చున్నవి. ఆంధ్రోద్యమము యొక్క రెండవ దశలో కలుగుచు వచ్చిన మార్పులును, మహాసభను కమ్యూనిస్టులు వశపరచుకొనిన పిదప దాని పునరుద్ధరణమును, ప్రభుత్వము వారి విధానమునందు కలుగుచు వచ్చిన మార్పులును చక్కగా విశదీకరింపబడినవి. అనుబంధమున ౧౩ ఆంధ్రమహాసభలలో అంగీకరింపబడిన తీర్మానముల మూలము, మహాసభల వివరము యథాతథముగ గలదు. అందరును చదివి యానందింపదగిన పుస్తకము.

కర్త: శ్రీ మాడపాటి హనుమంతరావుగారు. పుటలు ౪౦౦
వెల: చందాదారులకు, రు. ౨-౮-౦. ఇతరులకు రు. ౩-౬-౦.

## ౬. రాజకీయ పరిజ్ఞానము.

రాజకీయ శాస్త్రజ్ఞానమునకు పెన్నిధి యనదగిన ఈ పుస్తకము నిజాము కాలేజీలో రాజకీయశాస్త్ర అధ్యాపకులుగా నున్నట్టియు, ఉత్తమ గ్రంథ రచయితగను, మహావక్తగను, ఆంధ్రదేశమున ప్రసిద్ధిగాంచినట్టియు మహాశయునిచే వ్రాయబడినది. దీనిలో రాజకీయవిజ్ఞానము, రాష్ట్రోత్పత్తి, రాష్ట్రలక్ష్యము, రాష్ట్రప్రవృత్తి, రాష్ట్ర నిర్మాణము, కార్యకర్తృకము (Executive), రాష్ట్ర భేదములు, సమత, స్వేచ్ఛ, స్వామ్యము, మున్నగు ప్రకరణములలో ఈ శాస్త్రసంబంధము లగు సర్వవిషయములు సులభమగు భాషలో బోధింపబడినవి. అనుబంధమున (౧) ఇంగ్లండు, (౨) అమెరికా సంయుక్తరాష్ట్రములు (౩) భారతదేశము,

(౮) సోవియట్ రష్యా అనువాని రాజ్యాంగ విధానములు సంగ్రహముగా వ్రాయబడినది. మొత్తముమీద నీవి రాజకీయములు బాగుగా తెలిసికొనగోరువారికిని, ఇతరులకును అత్యంత ఉపయోగకరమగు గ్రంథము.

కర్త డాక్టరు మారేమండ రామారావుగారు ఎం. ఏ. ఎల్. టి, పి. హెచ్. డి.

వెల, చందాదారులకు రు. ౦-౧౨-౦
ఇతరులకు: రు. ౧-౦-౦

## ౯. ప్రాచీన జాతులు

ఇది యొక చారిత్రిక గ్రంథము. ఒకప్పుడు విద్యకు, వాణిజ్యమునకు, వీరవిహారమునకు పేరుపొందె రెండువేల సంవత్సరముల క్రిందట వెలసి కాలపురుషుని ప్రభావమున నామమాత్రావశిష్టములయిన అయిదు ప్రాచీన జాతుల చరిత్ర ఇందభివర్ణితమయినది. ఫినీషియనుల నౌకా విజ్ఞానము. కాల్డియనుల స్వాతంత్ర్య నిరతి, క్రీటియనుల, లిడియనుల, హెట్టయిటుల విశిష్టత ఈ గ్రంథమునందు విశదీకరింపబడినది. నిన్నటి చరిత్ర సంఘటనల ఫలితమే నేటి నాగరికతకు మూల కారణము. కావున అందరు చదువదగినది గ్రంథము.

గ్రంథకర్త:- ఖండవల్లి బాలేందుశేఖరం. ఎం. ఏ

వెల చందాదారులకు. రు. ౧-౮-౦
ఇతరులకు. ౧-౧౨-౦

## రాబోవు గ్రంథములు.

౧. వైజ్ఞానికుల జీవితములు,

కర్త: బి. వి. రమణారావుగారు, ఎం. ఎస్. సి.

౨. మాదన మంత్రి:

కర్త: భూపాలరావుగారు, ఎం. ఏ.

౩. రోమక సామ్రాజ్యచరిత్ర:

కర్త: నూకల నరోత్తమ రెడ్డిగారు, ఎం. ఏ.

౪. ఆంధ్రసాహిత్య చరిత్ర (రెండవ భాగము):

కర్త: ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం. ఏ.

"ఆంధ్రకుటీరము"
సుల్తాను బజారు
హైదరాబాదు-దక్కన్



మేనేజరు,
ఆంధ్ర చంద్రికా గ్రంథమాల.